శ్రీనివాసరావు, కోలాచలం, 1854-1919

# కీచకవధ లేక సైరంధ్రి

బళ్ళారి, 1924

Record no. 140

Śrīnivāsarāvu, Kōlācalaṃ, 1854-1919

Kīcakavadha lēka Sairandhri

Baḷḷāri, 1924

Record no. 140

Bibliographic Record Target

శ్రీనివాసరావు, కోలాచలం, 1854-1919
కీచకవధ లేక సైరంధ్రి / కోలాచలం శ్రీనివాసరావుచే రచియింపబడినది. - 1 కూర్పు. బళ్ళారి : ఆంధ్రాముద్రాక్షరశాల, 1924.
(2), 83 p. ;19 cm.
Record no. 140

Śrīnivāsarāvu, Kōlācalaṃ, 1854-1919
Kīcakavadha lēka Sairandhri / Kōlācalaṃ Śrīnivāsarāvucē raciyimpabaḍinadi. - 1 kūrpu. Baḷḷāri : Āṃdhrāmudrākṣaraśāla, 1924.
(2), 83 p. ;19 cm.
Record no. 140

సారస్వత నికేతనము, వేటపాలెం.

గ్రంథసంఖ్య. 1538

యీ గ్రంథమును యిందు క్రింద కడపటిదిగా వ్రాయబడిన తేదీలోపల వాపసు యివ్వవలెను.

| | | |
|---|---|---|
| FEB 24 1940 | 21·8·44 | 3-10-50 |
| MAY 8 _ 1940 | 4·11·44 | 22-8-51 |
| | 29·12·44 | 31-10-51 |
| 14·6·42 | 17·4·45 | 8·4·52 |
| 5·7·42 | 13·2·46 | |
| 5·8·42 | 25·4·46 | |
| 8·9·42 | 16·2·47 | |
| 7·1-43 | 16·3·47 | |
| 15·3·43 | 6·5·47 | |
| 11·4·43 | 14·6·47 | |
| 10·5·43 | 2·8·47 | |
| 13·11·43 | 16·8·47 | |
| 10·1·44 | 28·9·47 | |
| 7-2-44 | 14-12-47 | |
| 1·3·44 | 28·3·48 | |
| 29·6·44 | 17·8·48 | |
| | 10·12·48 | |
| | 14·11·49 | |

శ్రీ

# కీచకవధ.

లేక

(సైరంధ్రీ.)

నాలుగంకముల

తెలుఁగు నాటకము.




ఇది

బళ్ళారిలో వకీలుగా నుండిన

కీ. శే. బ్రహ్మశ్రీ కోలాచలం శ్రీనివాసరావుగారిచే

రచియింపఁబడినది.

కె. శత్రుఘ్నరావుచేఁ

ప్రకటింపఁబడియె.

మొదటికూర్పు.

బళ్ళారి.

ఆంధ్రాముద్రాక్షరశాలయందు

ముద్రితము.

1924.



వెల రు. 1—0—0

దుర్యోధనాదులపై ప్రయోగింపవేచి యున్నవాడు. వారిమనోభీష్టంబు దీర్చి నాకు సంతసంబు గల్పింపరాదే.

భీము.- మ॥ చిరకాలార్జితమైన రాజ్యవిభవ శ్రీనెల్లబోఁగార్చి మం
దిరముల్గానకవీథులం బడిన యోదీనత్వముల్ బూని
భీకరవన్యంబులబోలె కాననముల్ గష్టంబుల్ జె
దుముకాదర మే ధర్మజ యిట్టులుండ మనకున్ ధర్మంబె యోచింపుమా.

పితృపితామహార్జితమైన రాజ్యంబన్యులపాలుపరచి యుగ్రాటవిని గండమూలాదుల భక్షించి వ్రతములనల్పుచు యిట్లుండ మనమేమి శాంతివహించిన బ్రాహ్మణులమా? సింహములు నోటనున్న ఆమిషము గోమాయువు హరించినటుల మన రాజ్యశ్రీని ఆ కౌరవాధముడు హరించి మనమెంతటి దుర్బలులని తలంచునోకదా! దుర్మతులను దుర్జనులను ధాత్రి మననిచ్చుట యధర్మంబు గాదా! ధర్మకామప్రభవంబు సర్వార్థసాధనంబైన యర్థంబు నిడిచి దుర్బలునట్లు నిర్వేదింపనగునె, సమయాతిక్రమ భీతిని దుర్మార్గులను మనము గని పరాక్రమహీనులైరని దుర్మతులగు దుర్యోధనాదులు దలంపరా? శత్రులనాజినోర్చి వారిసర్వస్వమపహరించి పాత్రులకర్థమిచ్చి పుణ్యంబార్జించుట క్షత్రియధర్మంబు కాదా? అపురుషులు తమపూర్వభ్రాతలైన యసురుల మాయోపాయములజయింపరా? అన్నా! మనకీకష్టంబులు పలవదు. అదురాత్ముండగు దుర్యోధనురాజ్యంబిపుడు కుక్కముట్టిన పాలుంబోలె దూషితంబైనది. కావున పౌరజనాపద బ్రాహ్మణవరులునీ కనురక్తులై భవద్రాజ్యంబవలచియుందురు. మంచిసమయంబిది. సన్నాహంబైన రథంబెక్కి గజపురంబున కభిముఖుండవై క్షాత్రగుణంబు వెల్లడింపుము. విక్రమదర్పంబు జూపుము. ధార్తరాష్ట్రకదళీకాంతారచ్ఛేదము గావింపుము. మద్బాహుంగదాని హతికెనీ అహితులను గురిసేయుము. అరివరులనోర్చి సాగరపరివృతభూచక్రంబేలుము. తమోవిముక్తుండైన చంద్రునిబోలి వెలుగుము.

అనుబంధము. 2.

ధర్మజుడు:— అనుజా! నీవచనంబులు అత్యుదాత్తమహిమాన్వితములు. అయినను పెద్ద



లుండుసభను పండ్రెండేండ్లు అరణ్యవాసంబును పదమూడవయేడు అజ్ఞాతవాసంబును సలుపుదుమని ప్రతిజ్ఞపలికి యిపుడుదానికి వ్యతిరిక్తము సలుపుదుమేని సత్యభంగంబు వాటిల్లదా. చంచలమగు లక్ష్మికాసపడి సత్యము దప్పుదుమనగునే. సత్యసమయంబు నేనతిక్రమింపనోపను శుభోదయకాలంబు ప్రతీక్షించియుండెద.

గీ॥ నిత్యకీర్తినార్జించు సత్యమెలమి
భంగపరచుట ధర్మమే పవనతనయ
వలదు త్వరపడవలదన్న వాసిమీరు
కాలమొదవును నెమ్మదింగనుము మదిని.

భీముండు:— అన్నా! శుభోదయకాలంబు మనకు లభించుట దుర్లభంబు. అరణ్యవాసక్లేశంబులంబడి బహుకాలంబు గడిపితిమి. అజ్ఞాతవాసదుఃఖంబనుభవించుట కడుకష్టమైన కార్యము. అంతకుండు జనులకెల్ల కాలంబాసన్నంబైయుండు. శరీరికి మరణంబు నియతంబు. మరణంబునకుముందు, వైరంబును సాధింపనివాడు మనిషికాఁడని నాతాత్పర్యము. అట్టివానిజన్మంబు నిరర్థకంబు. అయ్యో! ధర్మజా! మనముపడిన పరిభవంబునకు ప్రతీకారంబు చేయునంతవరకు కోలుందవల్ల నాహృదయంబు దుర్మర్షాగ్నింబడినవానిం బోలె తపింపుచుండునుగదా? ఆదురాత్ములయెడ ధర్మముదలచి కారుణ్యము చాల్చియుండుట ధర్మము గాదు! శత్రుసంహారంబు జేయనివానికి సర్వవిధములహాని కలుగుననుట శాస్త్రసమ్మతము. అయ్యో! మముంబోలువారు అజ్ఞాతవాసంబెటులొనర్పగలము. ఆ బాలవృద్ధప్రసిద్ధుండవైన పార్థివసూర్యుండవైన నిన్ను జూచి యెవరు గుర్తింపరు. సింహాసనాసీనులైన నీతమ్ములను యెరుగని వారులోకములోనెవరైన గలరా? మనగూఢభావంబు మేరువుగూఢభావంబునుంబోలె అఘటమానంబు గదా? అటులైన బ్రతికియున్నంతవరకు మనకు వనవాసక్లేశంబు దప్పదుగదా? కావున విజయారంభంబునకిదియవసరంబు. దీనం జేసి ధర్మవిరోధంబు లేదు. నామాటల ఆలింపుము.

ధర్మరాజు:— పవనతనయా! సువిచారితంబై సిద్ధింబొందు కార్యంబు దైవానుకూలం

బైయుండు. కావున నెమ్మదిగ విచారింతము. దుర్యోధనాదులు శూరులు. వారినింగాడి నకర్ణశకుని భూరిశ్రవాదులు. అపజేయవిక్రములు. వారెట్లైన యుండని కర్ణుండు అభేద్యకవచుండు. వాని బాహువిక్రమమును దలచిన నాకు భయమయ్యెడు. భీష్మద్రోణ కృపాదులు అపారదివ్యాస్త్రవిశారదులు. ఇట్టివారి సంగతినిగన్న దుర్యోధనుని నిర్జించుటెట్లు?

(వేదవ్యాసుల ప్రవేశము.)

వేదవ్యా:- ఉ॥ వలదిక పుత్రులార వలవంతలు మీకిటు లర్జునుఁడు కా
నలతపమాచరించి కరకంఠుని చేఘనమైన యస్త్రముల్
వెలయఁగ నందునక్క తనవీరత వైరులఁ జంపి నీకు ని
ష్కలమగు రాజ్యవైభవము సర్వము నిచ్చును సంతసంబుగాన్.

యమతనయా! భీష్మద్రోణకృపాశ్వత్థామకర్ణులు అమిత భుజసత్వులు. వారిం పోరున వధించుట సాధ్యంబు కాదని నీవు వగదింపందనేల? అధిక యోగలబ్ధమును అతిరహస్యమును సగు ప్రతిస్మృతియను విద్య కానసంబున తపంబుఁ జేయుచున్న యర్జునునకు నేనుపదేశించినాను. అర్జునుండధిక తపోవీర్యప్రభవుండై యీశ్వరునిచే పాశుపతాస్త్రంబుఁ బడసి యింద్రయమవరుణకుబేరాదులవలన దివ్యాస్త్రంబు లార్జించును. వానిసహాయ్యంబున నీ శత్రువులనోర్చును. భయపడకుము. ఎట్లైనను యొకవత్సరంబు అజ్ఞాతవాసంబు సలిపినీ ప్రతిజ్ఞ నెఱపుము. సత్యంబు ధారణినిలుపుము నీకు శుభమగుఁగాత. నేఁబోయివచ్చెద.

(వేదవ్యాసుల నిష్క్రమణము.)

ధర్మరాజు:- అనుజా! ఈపరమతపోధనుని వాక్సారమునన్ను సంతోషసాగరమున ముంచెను. నేధన్యుఁడనైతిని. ఈసమీపమున నేయుండు కామ్యకవనంబుఁ జేరి సరస్వతీతీరంబున కాలంబుగడుపుదము రమ్ము. (ద్రౌపదింజూచి) ప్రాణసఖీ! నీవునడవఁజాలవేని, భీముఁడు నిన్నెత్తుకొని వచ్చును రమ్ము.

ద్రౌపది:— నాథా! నానుంచి యెవరికే శ్రమయువలదు. నే మెల్లగ నడచి వచ్చెద.

(నిష్క్రమణము.)



# ద్వితీయరంగము.

## కామ్యకవనము.

అర్జునుఁడు-ఋషులిరువురు.

అర్జునుఁడు:—( తపంబు చేయుచు కూర్చునియుండును. ఋషులు నిర్వురుగంది వానిం జూచుచుందురు. )

జాబాలి.—తపోధనా! చూచితివియా! ఈ పాండవమధ్యముఁడు మనోవాక్కాయకర్మనియతుండై పరమేశ్వరుని తన చిత్తంబున నిలిపి నిద్రాహారవిహారాదులు మాని నిరంతరంబు వాయుభోజనంబు చేయుచు ఘోరతపం బొనరించుచున్నవాఁడు.

కణ్వుఁడు:— జాబాలీ! ఈ భూరిబలుండు అపూర్వతపం బొనరించుటం జేసి తదీయోగ్రతపఃప్రభావదహనోద్ధిత ధూమచయంబులు అంబుదాకారములైన నాంతరము గప్పినది. సర్వజీవులకు అపార భయావహమైనదీతపంబు. దీనిమాన్పు విధమెద్ది?

జాబాలి:—ఆహా! అశ్రుతామ దృష్టపూర్వంబుగదా యీ తపోధను నిశ్చలభక్తి నిద్రాహారరాహిత్యంబే భూతతతికినైన సాధ్యంబే? గ్రీష్మంబున పంచాగ్నిమధ్యస్థితంబే? వర్షఋతువున జలాంతరానుష్ఠానంబేమి హేమంతంబున హిమనగవాసంబేమి దేనిఫలాభీష్టకామియై ఈ యిలాధీశుండీవిధంబున తపంబుచే కృశించెడునో? ఆ పార్వతీపరమేశ్వరుల పాదధ్యానంబు దప్ప నితరభాష యీ ప్రాణినోటరాదుగదా? ఇంద్రునకు యీ ఘోరోదంతంబు తెలుపుదమా? తెలిపిన ఆ బిడౌజుండేమి సేయగలండు. రంభోర్వశి మేనకాద్యప్సరస్సీ నికరముగదా అతినియతులగు యతుల తపోభంగంబునకు యతనిమూలబలంబు. ఇట్టి ప్రతనిష్ఠని రూపవరేమి సేయుదురు? మనమిపుడా పరమేశ్వరు సరసంజేరి యీ పరమభయావహంబైన ప్రమాదంబు ప్రాణకోటినుండి దప్పింపుమని వేఁడికొని పిలుచుకొని వత్తము.

కణ్వుఁడు:—అట్లనే కానిమ్ము. పోవుదము రమ్ము.

(నిష్క్రమణము.)

ఈశ్వరుఁడు:—అర్జునా! అతిమానుషంబైన నీ పరాక్రమమ్మునకు నేను మెచ్చితి. పూర్వ జన్మంబున నీవు నరుండను దేవర్షివి. నారాయణసఖుండవు. నరనారాయణులు మీరిద్దరు బదరీవనంబున అనేకాయుతవర్షంబులు తపంబుచేసిన మహావీర్యవంతులు. మీ కతంబున జగంబులు రక్షితంబులగుచున్నయవి. అర్జునా! దివ్యాస్త్రంబగు పాశుపతంబు నీ యిష్టానుసారంబు నీకు ప్రసాదించితి. దీనిని యుగాంత్యకాలమునందు ప్రయుక్తంబు చేసిన జగత్సంహారంబు చేయును. దీనినుండి యనేకశత సహస్రసంఖ్యల శూలంబులు వచ్చును. ఆశీవిషంబుల యట్టి అమ్ములుద్భవిల్లు. దీనిబడసి దైత్యదానవ యక్షరాక్షస పిశాచోరగమ్ములను అతివీరులైన భీష్మద్రోణాది వీరులను జయింతువు. సహజ కవచ శోభితుండలుండైన కర్ణుని వధియింతువు. ఈ యస్త్రంబున కసాధ్యంబెద్దియును లేదు. అల్పులయందు ప్రయుక్తంబైన జగత్సంహారంబుం జేయు. అర్జునా! నేం బోయివచ్చెద:

[అనుచు నిష్క్రమించును.]

అర్జునుఁడు:—[స్వగ] ఆహా! కష్టఫలీయనునది నాయెడ సార్థకంబయ్యె. ముక్కంటిని కంటిని. కృతార్థుఁడనైతిని. దివ్యాస్త్రంబు బడసితి. ఇంక నేనఖిల లోకంబుల జయించినవాఁడనైతిని. అయినను దిక్పాలకులెల్లర కరుణంబడసి వారి దివ్యాస్త్రంబుల గొనవలయును. తత్సాధనకై ప్రయత్నించెద.

( ఇంద్రుని ప్రవేశము. )

ఇంద్రుఁడు:— అనుబంధము 4.

అర్జునా! నేనింద్రుఁడను. నీ తండ్రిని. నీ తపోమహిమను మెచ్చి యీశ్వరుండు ప్రత్యక్షుండై పాశుపతాస్త్రంబు ప్రసాదించినది కనుంగొని సంతసించితి. నందనా! సహస్రాక్షులు నేటికి సార్థకంబులయ్యె. తనయా! నినుబోలు పుత్రునిఁజూడక నిలువఁజాల. కావున నీవు నా వెంట అమరావతికివచ్చి కొన్ని దినంబులు నాసరసనుండి నన్ను సంతోషసాగరంబున ముంపుము.

అర్జునుఁడు:—తండ్రీ! భవదాజ్ఞోల్లంఘన సేయ సమర్థుఁడనా? నీయానతి జవదాటఁగలనా! రాజసూయాశ్వమేధ శతంబులచేసిన వానికైనను దుర్లభంబగు నీ రక్షణ



బు నెక్కనంతటి పుణ్యంబు నాకుగలిగెనేయని నాచిత్తంబు ముదబ్ధిని నోలలాడుచున్నయది. మీ వెంబడి అగత్యము వచ్చెద.

ఇంద్రుఁడు:—అటులైన యాలస్యంబేల రమ్ము.

( నిష్క్రమము. )

చతుర్థరంగము.

అమరావతి.

ఊర్వశి - అర్జునుఁడు.

ఊర్వశి:— అనుబంధము 5.

ఆహా! నా మనంబెంత వెనుకకులాగినను నంత హెచ్చుగ ముందరికి నెగురుచున్నయది. శాతువశముమీరిన గుఱ్ఱమువలె నటించుచున్నయది. ఎంత నే బుద్ధిగఱపినను తనమాఢ్యము మానదు. పాపిదైవమా! అహర్నిశలు నాకీ దురవస్థ తప్పదాయెగా. అయ్యో! త్రిదశ జన్మంబెత్తి నేనేలబుట్టితి. నిద్రయంకైనను యీ దుఃఖంబు మానెదనన్ననో నిద్రరాకయున్నది. అకట కటా! ఆ సుందరాకారుఁడు పురూరవుని వంశపువాఁడు. ఆ పురూరవుని దారగ కతిపయ దినంబులు ధారణిని నే సంసారంబుఁజేసితి. ఈ మోహనాంగుఁడు వానివంశాంకురముగావున నన్ను నిరాకరించునేమోయని భయమయ్యెడు. ఆ సుందరాకారుఁడు అమరావతి చేరిననాటినుండి నా మానసదేశంబాక్రమించెను. వానియందంబు పురుషసౌందర్యంబింతయని ప్రపంచజనులెల్లరు తెలియుటకై ధాత సృజించినరీతి నగుపడెడు.

సీ॥ జిగియడుగులుచూడ జిగురులనగియెడు

నడుముచూడగలేదు పిడికెఁడైన

మోముచందను చందమామయందము మాన్చు

ననురాగరాగ మారారమోవి

అరమోడ్పుగన్నులే యరవిందముల గెల్చు
నళినెలఁ గెల్చు నౌరౌర నుదురు
చికిలి చెక్కుల చెన్ను చెలువుచుఁ జంద్రిక కాంతి
చపలాలతాని భచ్ఛాయమేను

గీ॥ నయనమంబులు శ్రీనిధు ల్చెవులయారె
నవన మొనరించు నవ్వు నౌరనాస చెలువ
నరుచిగళమున కొంతటి తరము వరము
మన్నె మొగ్గల చాలు పో పల్లువరుస.

అట్టి సుందరాకారుని వదలి నేనుండగలనా! వావివరుస ఆ పన్నెకాఁడు వారించినానేని వారకాంతలకు వావివరుసలు లేవని శాస్త్రములు చూపి వాని సోధించెద.

కం॥ పలుకులఁ బులు ఖండమ్ములు
జిలుకుచుఁ జిలుకలను రేచి చిత్తముఁ గలఁతుఁగా
గులుకుమ వాలుఁ జూపులమును
ములుకులు నెటఁ గుచ్చి వారిముదమున దేల్తుఁగా.

ఇటు చేయకున్న నాజన్మంబు వ్యర్థంబు. స్త్రీ సాహసమునకు సాటి వేఱొకటి కలదా? దేశంబులు సాధింతురు. రాజ్యంబులు సాధింతురు. వలయునేని మ్రజ్జగములు సాధింతురు. వనితలనిన సామాన్యులా? ఇఁక నా సాహసంబు జూపి ఆ రాకుమార సుకుమారుని బొంది సుఖమందెద. వానిఁ బిలువం బోయిన నాదాసి యిఁకను రాక తడిసెను. కారణమేమియుండును. ఇంద్రుఁడు రొప్పనివైనను వానిని నిలిపియుండునా! అయ్యో! వానిని జూడక నిలువఁజాలను. ఏవతో వచ్చినలాగగుచున్నది. ఎవరును లేరే?

ఉ॥ కన్నులఁ గట్టినట్టులగు కాంతుని యాకృతి యెల్లకాలముం
విన్నను నొప్పువాని నుడివీనుల విందుగ నుందు నెత్తఱిన్



గ్రొన్నన వింటి క్రీడలను గుబ్బలు కౌఁగిటఁ జేర్చినట్టుగన్
మన్నన జేసినన్నెపుడు మాన్యుఁడు మారుని కేళి నేలునో.

వానినెపుడు నేగని కన్నుల గప్పుకొందునో? వానిపరిరంభణానందం బెపుడందుదునో? ఎపుడా సుందరుండు నామనోరథంబీడేర్చి సుఖవారిధిలో ననుదేల్చునో? నా ప్రాప్తి యెటులున్నదో తెలియకున్నది.

అనుబంధము 6.

( అనుచు కూర్చుని చింతించుచుండును. )

అర్జునుఁడు:—(ప్రవేశించి ఊర్వశిం జూచి) తల్లీ! వందనంబు లాచరించెద.

ఊర్వశి:—(దిగ్గునలేచి) అర్జునా! ఏమి క్రొత్తమర్యాద నేర్చితివి? వందనంబన నేమి?

అర్జునుఁడు:—తల్లీ! పెద్దవారి యాశీర్వాదంబుఁ గోరి చిన్నవారొనరించు నమస్కృతికి వందనంబని పేరు.

ఊర్వశి:—అర్జునా! తల్లీయని నను బిలిచితివే. నేను నీ తల్లినెటులఁ?

అర్జునుఁడు:—అమ్మా! మదీయ వంశకర్తయైన పురూరవునకుఁ బత్నివైన కారణంబునను, పురందరునకు బరిచర్యయొనర్చుటను నాకు జనని వగుటకు సందియంబేమి?

ఊర్వశి:—సుందరాంగా! వావివరుసలు సంకేతవాచకములు. నామములట్టివియే. అందున యీ లోకంబున వనితలుఁ బురుషులు విచ్చలవిడిఁ గ్రీడింతురు. ఇచ్చటికిది యనిందితంబైన యాచారంబు. నీవు త్రిదివంబునకు వచ్చినయప్పుడ దివ్యపురుషుండవుగావున నా మనోరథంబు సఫలంబుగా మందారమంజరీ మంజులమకరందపాన, మత్తమధుకర గారమనోహరస్థలంబులను, మేరుశైల కందరంబులను, నితాంతకాంత వికసిత కనకారవింద సమధిక సౌరభ సంవాసిత మహానందకందంబులైన మందాకినీతీర మణిమయ వేదికలయందును, చంద్రికా సుందరంబులైన సికతాతలంబులను మరియు నిర్జర విహారస్థానంబుల ననవరత సురతకేళీ సౌఖ్యాంబుధి ననుఁగూడి నోలలాడుము.

అర్జు.- ఉ॥ వయసనుభూతమాంగనలవారిఁ జేరినమాత్రవారికిన్
లయమగుబుద్ధిదూరమగు లజ్జవివేకము తప్పుపాడియున్
క్షయమగునీతిశాస్త్రములసంగతి సూన్యమగున్ దలంపగా
భయముమనంబునన్ ఘోరదుపాతకసంగతి హెచ్చునిచ్చటన్.

(హరి! హరీ! ఎంతటి కర్ణకఠోరంబులగు వాక్యంబులు వావీనులం జొనిపితివి) (ప్రకాశముగా) తల్లీ! ఇదియేమి విపరీతచర్యలు. జగంబులు పుట్టింపను మనుపను గర్తలైన దేవతలకునెట్లు నడచినను నెగ్గులేదు. నేను గర్మభూమిని జనియించిన కర్మఠుండనైతి. నాకు నిచ్చటి యాచారంబుచితంబుగాదు. ఇఁక నీవిట్టి మాటలం బలుకక నన్నుం బుత్రవాత్సల్యంబునజూచి మన్నింపుము. పాపాయత్తంబైన యిట్టి తుచ్ఛవృత్తులకు నీ బుద్ధి నిందింపకు. నీకు బునః ప్రణామంబొనరించెద.

ఊర్వశి:—అర్జునా! నీబుద్ధి పెడదారిఁబట్టెనా? ఏల మాటిమాటికి తల్లీ తల్లీయని పిలిచెదవు. నేను నీతల్లినా? ఈ యమరలోక వేశ్యలమైన మాకు మంగళసూత్రము గట్టిన మొగుఁడొకఁడున్నవాడా? స్వేచ్ఛా విహారులమని నీకుమాత్రము తెలియదా? ఇఁక భూజనుఁడు నీవనికదా యోచించుట? భూలోకంబున యజ్ఞయాగాది క్రతువులంజేసిన తండ్రియును కొడుకును, యీ లోకంబున వావివరుసలు గణింపక మాతో సుఖించుటలేదా? వలదీ యనుమానంబులు. ఈ లోకంబున నప్పుడప్పుడు నారదాదిమునులు నీ యవక్ర విక్రమంబును సముదగ్రగుణంబులను బొగడుటవిని, భవదీయ సంగమంబునకునై చంద్రికాగమనంబునకు చకోరంబు నిరీక్షించుపగిది కాలకాలము వేచియున్నదానను.

అనుబంధము 7.

సీ॥ వగకాడనీమోము సొగసును గనినంత
వగలను తగులము మిగుల హెచ్చె
మదనునిబాధల నదరుచు బెదరుచు
హృదయముకుదుళ్లఁ జెదరెకనుమా



నిన్నునేగానకయున్న నాకన్నీరు
మున్నీరుగాఁబొంగి మోముబాపు
నిదురలోనిచారు వదనముముద్దిడ
గదిసినరీతిగఁ గలనుగాంతు

ఆ. వె॥ చలువగాలిసోకఁ జిలునకాటుగనగు
పూలశయ్యకేలి కీలయగును
చెలులపలుకులెల్లఁ జెవులకుములుకులై
తోచువిరహ తాపమేచునన్ను.

మోహనాంగా! నిన్నటిరేయి నేను బాళిచేసోలి తాళజాలక తూలితాలిమి ప్రేలి శయ్యపైవ్రాలిపడిన పలువిధముల బాధలు నీవు గన్నులారఁ గనియుండినచో నింతగ దయమాలి నన్ను దూలనాడి పలుకుచుండలేదు. సుందరాంగా! అంతటియిడుములనేబడకున్న క్రీడకుందోడు నీడైన యాడుపుట్టువగు నేను భయంబువీడి లజ్జబోనాడి రతిక్రీడకునిను వేఁడుచుంటినా? కాంతా! సంతతదురంత కంతులతాంతకుంతాళి తాంతయగు కాంతను సన్నింపగారింతువే? ప్రాణపతీ! అబలపై జాలివలదా! మోహనాంగా! ఇఁక యాలస్యంబుసేయక ననురతికేళి దేల్పుము.

అర్జునుఁడు:—అమ్మా! నీవు నాతల్లివి నా వంశకర్తయైన పురూరవుని భార్యవు, కావున నా మాతవు. నీవిట్టి తుచ్ఛసుఖంబులు ననుఁగోరుట తగవుకాదు.

సీ॥ వినవమ్మ విధుముఖీ విషయానుభవసుఖం
బులుబోలు నెండమావులనునెలమి
నీరజలోచనా నీటిబుగ్గలఁబోలు
నింద్రియసుఖముల నేలకోర
బోటిరో యైహిక భోగములెన్నగా
నీటివ్రాతలుగావె నిక్కముగను

తోయజాననయిట్టి తుచ్ఛమౌ భవములు
దర్పణరూపముల్ తథ్యమగునె

గీ॥ ఇంతిమిథ్యా సుఖంబులనిచ్ఛయించి
యిహపరంబులు రెంటిని నీగవలదు
నీతిధర్మప్రవర్తన నిన్ను గాచు
వలదుననుగోర వలదమ్మ కులము చెడును.

తల్లీ! కలిమికివలరణవన్నె తెచ్చుభంగి సతికి మానము వన్నె తెచ్చును. అమ్మా! కననమున నిలుకడరీతి పదవతికి మానము ఖ్యాతిగదా? మాటకుసత్యమాభరణంబగురీతి బోటికి మానమాభరణముగదా? మానముఁ వదలిన మానిని యినదీప్తి లేని దినమురీతి శోభిల్లదుగదా? శ్రుతిలేని పాటరీతి రంజిల్లదుగదా? అమ్మా! భోగంబులు మనోరథ జాతమాత్రంబులగునుగాని నిత్యంబులుగావు. దీనినెరిగి యిట్టి దుర్విషయానుభోగంబులు గోరకు. నిను వేఁడెద.

ఊర్వశి:— మోహనాంగా! నీవద్ద వేదాంతోపదేశంబునంద నే వచ్చినదాననుగాను. గ్రంథంబులోని నీతులు క్రోడీకరించి అందరు మెచ్చులాగున నుపన్యసింప వచ్చును. అరీతి నటింపనలవికాదు. పుంస్త్వాభరణుఁడవగు నీ వీరీతి బిగియుటకు గారణంబు నేనెఱుంగుదు. నీ తండ్రియగు బురందరునికి వెఱచి కాబోలు నీవిటు లనుమానించెదవు. ఆ భయంబు నీకువలదు. అతినియతుఁడగు యతీంద్రుని కులపతియగు యహల్యాసంగమంబుఁజేసిన నీ తండ్రి, నీవొక వెలయాలి మనోరథంబీడేర్చుటవిన్న నినుదండించి ఖండించునా? వలదుభయంబుంకాలహరణంబువలదు. రమ్ము. పోవుదము (అనుచుచెయిబట్టఁబోవును.)

అర్జును.— అనుబంధము 8.

అమ్మా! తల్లివని నిన్నింతదూరంబు వేఁడికొంటిని. మాటిమాటికి నీవు వెలయాలివని ననుబలాత్కరించెదవు. నాప్రతిజ్ఞ నీకు తెలియదుగాబోలు. ధర్మపత్నీ సంగమంబుదప్ప నేనన్యకాంతా సంగమంబుగోరువాఁడగాను. దృఢచిత్తుఁడగునను జలింపజేయ నీ సాధ్యంబుగాదు. నే బోయివచ్చెద.



ఊర్వశి.— అనుబంధము 9.

అర్జునా! కుసుమశర శరపరంపరాహతనైయినుఁ జేరితి. నా మనోరథంబీడేర్చు వరకు నినువదలుదాననుగాను. నే తాళజాల. నీ పరిరంభణ సుఖంబిపుడే నందెద (అనుచుఁ గౌగలింపఁగోనుటకుగాను శరీరముతగులును.)

అర్జునుఁడు;— ఛీ! మూర్ఖురాలా! నన్నంటకు (అని వెనుకకుద్రోయును. ఊర్వశి పడును. (

ఊర్వశి:—(పడిలేచి) ఓరీ - పురుషాధమా! పైఁబడివచ్చిన దీపదలియని పరిభవింపనగునా? ఇది పరియోధనుని ధర్మమా?

ఉ॥ జాలినిమాని మానినుల సాహసవృత్తినిఁ ద్రోయఁజెల్లు నే
కులీనకాంగనల్ కుసుమకోమలగాత్రలు గారె యాగతిన్
బాలినిఁ బోలినట్టి నవపల్లవపాణుల నెచ్చటేని యీ
లీలయవమానాద్యాల నలించిరెత్రోసిరె! రట్టుసేసిరే!

ఓరీ! యౌవననాథమా! నా మాటలు వినవుగా? నాకోరిక ఫలింపఁజేయవుగా? ననుపతిదేశినిఁ చేల్పవుగా?

అనుబంధము 10.

అర్జునుఁడు:— అమ్మా! పాపాయత్తమైన కార్యమీ ప్రాణంబున నీ యర్జునుఁడు నెన్నటికిని చేయఁడు. ఈ యడియాసలుమానుము.

ఊర్వశి:— ఛీ! ఇది పాపమా! ఈపనినీవు ప్రాణంబునఁజేయవా? అట్లైన విగత మనోరథనై నేఁ బోవచ్చునుగదా?

అర్జునుఁడు:— తల్లీ! అగత్యముగ బోయిరమ్ము.

ఊర్వశి:— అర్జునా! నీచే నవమానింపఁబడి వచ్చినదారి బట్టుకొని నే నూరకపోవుదునా? నేనంతటి బలహీననా? ఇదిగో నావాగ్బలంబుఁ జూపుదు.

కం॥ యువతిని వెలితిగబల్కుచు
నవమానించితివిగాన అర్జుననీవున్

భువిపుంస్త్వహీనుఁడవై
నవియుచుకుందుచును బ్రదుకుమయ్యా యెలమిన్.

అర్జునా! నీవు నపుంసకుఁడవై మానహీనత మహిలోకమునియుండుము. నేవిగత మనోరథనై పోయివచ్చెద.

( అనుచు నిష్క్రమించును. )

అర్జునుఁడు:—(ఏడ్చుచు)

సీ॥ పాశుపతాస్త్రంబు బడసిపోయెదునాకు
నింద్రుడడ్డంబౌచు నేలవచ్చె
వచ్చెనుపోనన్ను వసుధనుండగనీక
త్రిదివంబునకు నేలత్రిప్పి తెచ్చె
తెచ్చెనుబోనేను తెలివిమాసుచువీథి
నరగితినటునన్ను నతివజూచె
చూచినమాత్రానసుదతి కామాంధయై
శాపమియ్యగనేల కోపమూని

గీ॥ షండుఁడైననేను శాత్రవాళిని నెట్లు
నాజిబోరుటెట్టుల యవనియందు
నాదువైరికర్ణు నణుచుటనింకెట్లు
అన్నజూడగోరి యరుగుటెట్టుల.

హా! అయ్యో! ఏమిచేయఁబూని యేఘఫలంబనుభవించితి. ఏకాదశవర్ష వనవాస క్లేశంబులకోర్చి ఘోరతపంబాచరించి యీశ్వరునిమెప్పించి దివ్యాస్త్రమగు పాశుపతాస్త్రంబుబడసి నపుంసకుండనగు నేను ధారుణి నెటుచేరుదు. ధార్తరాష్ట్రులతో నెటుపోరుదు. సూతతనయ సౌబలులకు మోమెట్లుజూపుదు. నాయన్నదమ్ములతో నెటుమాటలాడుదు. అయ్యో! ఇంతటి యవమానాగ్నిని



గుంది మరుచు తపించుటకంటెను ప్రాయోపవేశంబున ప్రాణంబులు మానుట యుక్తంబని నాకుందోచెడు. అటు చేసెద ( అనుచు యోగాసనాసీనుఁడై కూర్చొనియుండుట.

ఇంద్రుని ప్రవేశము.

ఇంద్రుఁడు.— అనుబంధము 11.

తనయా! మానమూని యిటులేల తపింపుచుఁ గూర్చుంటివి? నీ ముఖభావంబుఁజూడ భూరి వ్యసనసాగరంబున మునిఁగినవానింబోలెఁ దోచుచున్నావు. కారణంబేమి? నీకు నెవరినుండి యే యెగ్గునాటిల్లెను? చెప్పు ( అనుచు లేపును. )

అర్జునుఁడు:— తండ్రీ! అవమానకరమైనవార్త నేనేమని చెప్పుదును. ఊర్వశి యను నన్నుఁ బిలిపించి రతికేళికి బలాత్కరించెను. నా వంశకర్తయైన పురూరవుని భార్యగావున నా తల్లివియని పల్కి, ఆమె కోర్కె నెఱవేర్ప నిరాకరించితిని. దానికి కినిసి యూర్వశి నన్ను నపుంసకుఁడవు గమ్మని శపించెను. ఆ శాపతప్తుఁడనై గుందుచున్నాఁడను. ఏమి సేయుదు?

ఇంద్రుఁడు:—తనయా! నీతల్లి యూర్వశి నిన్నాశీర్వదించినది. నీ యజ్ఞాతవాసంబున నొకవత్సరంబు ప్రచ్ఛన్నవేషంబు మీకుఁగావలయునుగదా? ఆకాలంబున నీవు నపుంసకుఁడవై స్త్రీరూపంబుధరించి కాలంబుగడుపుము. అజ్ఞాతవాసాంతమున యీ శాపవిమోచనంబు నీకుఁగలుగునటుల నే వరంబిచ్చెద. కావున సంతోషమున నుండుము. చింతవలదు.

అర్జునుఁడు:—తండ్రీ! నీ పుత్రవాత్సల్యమునకు నే మురిసితిని. నా యన్నదమ్ములనుఁజూచి చాలాకాలమాయెను. అజ్ఞాతవాస కాలంబు చేయుకాలంబు సమీపించెను. కావున తండ్రీ నాకు సెలవిమ్ము. పోయివచ్చెద. నీకు నమస్కరించెద.

ఇంద్రుఁడు:—రాజ్యప్రాప్తిరస్తు! తనయా! నీవు భూలోకమునకుపోయి నీ సోదరులతో గలసికొనుము.

( నిష్క్రమణము )

# పంచమరంగము.

## అరణ్యము.

( ధర్మభీమార్జున నకుల సహదేవులు ధౌమ్యులు కొందరు బ్రాహ్మణులు. )

ధర్మరాజు:—బ్రాహ్మణోత్తములారా! ఆ దురాత్ముండు దుర్యోధనుడు చేసిన కుటిల విచేష్టితంబులు మీకెల్లరకు తెల్లంబుగాదే. మీరెల్లరు మముగూడి అడవుల నిడుములబడితిరి. ద్వాదశవర్షంబు లొకతీరునబోయెను. ముందొక సంవత్సరంబజ్ఞాత వాసంబు సలుపుట విధిగనున్నది. ధార్తరాష్ట్రులు సూతతనయ శకునులు. మము కనిపెట్టు మార్గంబు కనిపెట్టుచుందురు. మా యునికిపట్టు వారికెరిగెనేని చాలయెగ్గువాటిల్లు. కావున రహస్యవృత్తిమై చరియించునట్టుల వరంబిత్తురని మీ పాదారవిందములకు వందనంబు సలిపెద.

ధౌమ్యుండు:—ధర్మరాజా! నీకొదవిన దుర్దశలకు నీవు చింతిలవలదు. దేవతలకైనను ధాత వ్రాత దాటసాధ్యంబే? నిలింపపతి మున్ను నిషధాద్రియందు నిర్భాగ్యుడై నివసించడే? శ్రీహరి వామనాకారమున అదితిగర్భంబున డాగడే? ఔర్వుండు తిరహస్యంబుగ తనజననియూరు ప్రతచర్యబూని ధేనుశరీర విలీనుడై కాలంబు గడుపడే? సమయము వచ్చినపుడు వారందరు తమరిపుల జయించి ప్రజల సామ్రాజ్యమనుభవింపరే? కావున నీవిపుడాపదల కోర్చితరిగాచి రిపుల జయించి నీ రాజ్యంబుగొని సురక్షితంబుగ ననుభవింపుము.

నకులుండు:—అన్నా! ధర్మరాజా! గతమునకు వెతపడి ప్రయోజనంబేమి. నీదు సత్కర్మమునకు మెచ్చి ప్రీతిమై ధర్మదేవత యిచ్చినట్టి వరబలంబునబట్టి అజ్ఞాతవాసము సురక్షితముగ సల్పుదుము.

భీముండు:—ధర్మరాజా! నీ ఆజ్ఞానిగళ నిబద్ధులము కాకయుండినచో పాండవద్విపములు మదమేరి దర్పాటోపంబున కౌరవ్యాంబుజశ్రేణిని చీల్చి చక్కాడియుండవే? యిపుడేమనికొనిన యేమిప్రయోజనము.

అర్జునుడు: అగ్రజా! ఈ కురుదేశంబు చుట్టుపట్ల పాంచాలచేది మత్స్యసాళ్వవిదేహ బాహ్లిక దశార్ణశూరసేన కళింగ మగధ దేశంబులున్నవి. అవియెల్లను సుభిక్షములై నివాసయోగ్యతకలిగి యున్నవి. వానియందు మీకుంబోలినయెడ తగినచందంబున నిలుచుట శ్రేయంబని నాకుందోచెను.



ధర్మరాజు:—సోదరులారా! మత్స్యనరపతి సద్ధర్మవర్తి. సుజనహితుడు. అవార్య బాహుబలుడు. మనబంధువుకావున ఆ విరాటుని నగరంబుజేరుట యుక్తంబని నాకుందోచెను. మనలో యెవ్వడేరీతి యేపనిబూని విరటునిసేవను కాలంబుగడపవలయునో నిర్ధరింపదగినది అవశ్యకముగావున మీమీ మానసంబు ననున్న తెలుగున వెలిపేయుడు.

అర్జునుడు:—(లేచి అందరినిజూచి చింతించుచు)

ఉ॥ శాంతియుదాంతియు న్వేలయు జాగపుభోగములుల్లసిల్ల
నత్యంతప్రభుత్వగౌరవము నార్జవముం గడుమార్దవంబునుం
సంతసపూతచిత్తమును సత్యసమావృతవాక్యసారముం
సంతతముంగనునీవెటులనైతువో అక్కటహీనదాస్యముం.

ధర్మజా త్రిభువనము నవలీలగా నేలజాలు నీవు పరులసరస దాస్యవృత్తి నెటు నిలుతువని చింతించెద.

ధర్మరాజు:—అర్జునా! కాలంబువచ్చినపుడు కన్నయవస్థ బడకతప్పదు. నేను సన్యాసివేషమూని ఆ రాజన్యునింజేరి అతని యనుగ్రహమునకుం బాత్రుడనై శ్రౌతస్మార్త జ్యోతిర్విద్యల నొక్కొకతూరి నా చాతుర్యముం జూపెద. మరియొకతూరి అతని కౌతూహలవృత్తికిం దగినరీతి ద్యూతమున అతనితో క్రీడించుచుండెద. కంకుడను నామధేయంబు ధరించెద. నీ వెవ్వడవని మత్పూర్వవర్తనంబా విరటుడు ప్రశ్నించెనేని ధర్మపుత్రుని మిత్రుడని పలికెద. నేనెట్టులైనను గూఢవృత్తిని నుండెద. ఈ భీముడు రిపుకుల భీముడు యెటుదాస్యవృత్తి వర్తించి కాలము గడపునో తెలియకయున్నది.

చం॥ అతివకుహృన్నదంబుగను యక్షులజంపిసుమాళిదెచ్చెదు
ర్మతియగునాహిడంబకనరాదుని గూల్చెదురమ్మునందున
త్యతులబలాఢ్యులా బకజటాసురులం వడిజీల్చెగా గజా
యుతబలిసైనతమ్ముడు వృకోదరుడేవిధి నోపుదాస్యముం?

భీముడు:—అన్నా! ఆ నరేంద్రునిజేరి అతనియింట వంటలవాడనై షడ్రసంబు లుప్ప

ఏమిదో పదుభామినీ యెటులనీవు.
నీచవృత్తిని నిలుతువో హీనసేవ.

## అనుబంధము 12

ద్రౌపది:—ప్రాణనాథులారా! నేను సైరంధ్రి వేషంబుధరించి సుదేష్ణ అంతఃపురంబుననుండెద. మాలినియను నామంబు వహించి మత్స్యరాజ మహిష మన మనకు మక్కువ గలుగులాగు నటించెద. నా పూర్వవృత్తాంతంబు రాణి యడిగెనేని నేను ద్రౌపదీ సత్యభామలకడ దాస్యవృత్తిని నుంటినని వచించెద. నాకునై మీరు వంతలనుంగొనలదు.

ధర్మరాజు:—ధౌమ్యుల జూచి.

## అనుబంధము 13.

ఆచార్యులవారూ! మీ సంపూర్ణానుగ్రహంబున మేమెట్లైన నీ కష్టతమంబయిన అజ్ఞాతవాసంబుధిని తరింప ప్రయత్నించెదము. మన అగ్నిహోత్రంబులనెల్ల తమ ఆశ్రమమున నుంచుకొని రక్షింతురని ప్రార్థించెద. మనవెంట వచ్చిన కొందరు ద్రుపదపురంబు జేరుదురు. మరికొందరు ద్వారకానగరంబు నకరుగువారు. ఎవ్వరైనను మనవార్త లడిగిరేని ద్వైతవనమ్మున పాండవులు తమ్ము వదలి యెచటికో వెళ్ళిరని తెలుపవలయు.

ధౌమ్యుడు:—పాండవులారా! మీ దేహమెల్ల కన్నులిడుకొని వర్తింపవలయు కాలంబు మరచితిరేని కార్యంబుతప్పును. ధర్మాధర్మ సూక్ష్మంబులెల్లను మీకు కరతలామలకములైనవి. యీ యజ్ఞాతవత్సరంబు మీరు సురక్షితముగ గడుపునటుల దైవమును ప్రార్థించి ప్రయాణమగుడి.

## అనుబంధము 14.

ద్రౌపది:—(రోవ నడుచుచు ధర్మజునిజూచి) నాథా! విరాటనగరంబు అతి సమీపమున నున్నదని పలుకుచు నెంతో దవ్వు నన్ను విలుచుకొనివచ్చితిరి. నగరు రాదయ్యె. అలసట బలమయ్యె. ఈ యడవినిదాటు మార్గంబు తెలియదాయె.



కం॥ కడుకరకురాలు ద్రొక్కుచు
నడుగుల రక్తము స్రవించె నకటా యికనే
నడుగిడఁజాలను పయనంబుడుగుము
బడలితిని పథకు నోపలి వెకనుమా.

(అనుచు కూర్చుండును.)

## అనుబంధము 15.

ధర్మరాజు:—(అర్జునునింజూచి) అర్జునా యీ పుష్పకోమల యాజ్ఞసేని కడుడస్సినది. మనము విడియుటకు నీయెడ నెంతయును చోటుకానరాదు. అరణ్యమార్గములు సంచరించి మనము బలుబడలితిమి. విరాటపుర సమీపభూమి చేరునంతవరకు నిమ్మీనాక్షిని భరియించితెమ్ము.

అర్జునుడు:—ధర్మజా! విరాటనగరంబదిగో దృగ్గోచరముగనున్నయది. అదిగో ఆ పురి సరస దీర్ఘశాఖావృత పాదపంబులుగల ప్రదేశంబు లనేకంబులు గన్పట్టుచున్నయవి. ఇమ్మచ్చకంటిని నచ్చటివరకు నే భరియించి తెచ్చెద. ఈ రేయి మనమచ్చటనుండి ప్రాతఃకాలంబున మారు వేషంబులబూని ఆ ధరాధవుని సమీపంబు జేరుదము. ఇదిమీకు సమ్మతికదా?

ధర్మజుడు:—సోదరా! మాకెల్లరకు అది సమ్మతి.

అర్జునుడు:—(ద్రౌపదిని యెత్తుకొని దారినడచును.)

(నిష్క్రమము.)

## షష్ఠమరంగము.

విరాటనగర సమీప వనభూమి:

పంచపాండవులు. ద్రౌపది.

ధర్మరాజు:—అర్జునా! మనమీ ఆయుధంబులతోడను ఈ వస్త్రములతోడను పురంబు ప్రవేశించితిమేని జనులకు భయవిస్మయములు గలిగించినవారమగుదుము. నీ కరమండిత గాండీవము లోకంబున జనులందరెరింగినది. భీముని గదాదం

డను లోకప్రసిద్ధమైనది. ఇట్టి ఆయుధంబులబూని మనము ప్రకటము చేసితిమేని పాండవులు వీరని జనులెరుంగుదురు. వెరల మనము పండ్రెండేండ్లు వనవాసంబును నొకయేడజ్ఞాతవాసంబును జేయవలసి వచ్చును. దీనికి సమంజసమైన యాలోచన యేదియో నాకు దెలియకయున్నది.

అర్జునుడు:—అన్నా! దీనికై నీవు చింతింపవలదు. శవభస్మాస్థిగాలాది ప్రకవ్యాప్తముచే నభిగమ్యంబై భీకరంబై ఆ స్మశానంబుచేరువ భూమిని శమీవృక్షంబొకటి యున్నది. మనమా శమీవృక్షముంజేరి మన ఆయుధముల నందుంచెదము. ప్రేతనిలయప్రాంత్యమిదిగావున రక్షోభూత పిశాచ వాసయోగ్యంబై దుర్గంధనిలయంబునై చిత్తక్షోభంబొనరించుచుండు గావున యీ శమీవృక్షంబెవ్వరికినగమ్యంబుగ నుండును. కావున మన శస్త్రాస్త్రములు అందుంచుట మేలని నాకుందోచెను.

ధర్మరాజు:—అర్జునా! నీ యాలోచన సమంజసముగ నున్నయది. ఇప్పుడే మనమన ఆయుధములగూర్చి మోపుగ గట్టియుంచెదను. (భీమునిజూచి) పవనసూనా! భండనంబున రిపుకాండగర్వఖండన ప్రావీణ్యతనుగన్న నీకరమండిత గదాదండమిటులుంచుదము.

భీముడు:—(కన్నులెఱ్ఱజేసి ధర్మజునింజూచి తలత్రిప్పి గదాయుధమెత్తి యుంచుకనిలిచి)

కం॥ అవనీతవైరిసర్వత
పవిగానసురాళి ప్రాణపవనాహినిగా
భువి వెలయు గదాయుధమా
పవనజుడిటు నిన్ను వదలు ప్రాప్తించెన్.

నిఖిలరిపుయోధవర వధాచరణ నిపుణమౌ నిఖిలరాజన్యగర్వపర్వతపవియై నిఖిల నిశాచర ప్రాణానిలపన్నగమై పవనసూనకర మండిత నిరంతరవరఫలమై నెగడిన గదాయుధమా! యీ భీముడు భీమవిక్రమగర్వ భీముడు సోదరునియాజ్ఞానిగళ నిబద్ధబద్ధుడై బహిఃప్రాణంబుగనుండిన నిన్ను యత్నములేక యొకయేడు వదలి నీవిరహానల తప్తుడై కాలము గడుపుచుండును. గదాయుధమా! ననుమన్నింపుము. అలనాడు జలవిహారాంతరమున నలసటచే పటగృహంబున గాఢనిద్రా



పరవశుడనై పరుండియుండిన నన్ను లతావళులచే బంధించి మందరాచలమును భోగిబంధనమున నబ్ధిబడద్రోయు చందంబున గంగాహ్రదంబున బడద్రోసిన దురాత్ముని దుర్యోధనుని ప్రాణంబు దీయుటకు నెదురుచూచుచు నించుక విశ్రమించుకొనుము. మరియు పచ్చ్యమానమగు కాలకూటముగల ఫణిదంష్ట్రల వలన సూనుడగు నా శరీరమంతయు గరిపించి ధానివే మృతినందగలదని చింతించి విందుకు బిలిచి విషాన్నమిడిన దుర్బుద్ధి దుర్యోధనునకు మరణంబు గలిగించు కాలము తటస్థించు నంతవరకు నలసట దీర్చుకొనుము. ఆ మాత్సర్య విషావేశగ్రస్తుడై హస్తినావతినుండి పాండవులను వెడలించి వారణావతంబున లాక్షాగృహంబున మమునెల్ల నగ్నికి నేకాహుతిగ బలినివ్వ బ్రయత్నించిన దురాత్ముని కౌరవాధిపుని కండకావరమ్మార్పు కాలము వచ్చునంతవరకు దీర్చుకొనుము. హా! కులాంగనను యీ పతివ్రతను ఈ ద్రుపదరాజ వరపుత్రిని కొప్పుపట్టి నిండుసభకునీడ్చి మొరయిడినను సరకుసేయక రంభోరూ ఊరువెక్కుమని గర్వభీముగ దొడజూపిన గర్వాగ్రేసరుని కురుకులాధముని తొడలు ఖండించి పొడిచేసి పుడమిని గలుపునంతటి సమయము సంభవిల్లునంతవరకు నిట్టూర్పులు వదలుచు ఈ చెట్టుపై నిలిచియుండుము. పరస్త్రీని పతివ్రతను నేకవస్త్రను కామాంధుడై స్పృశించి రాజసూయాధ్వరంబు నందవభృథస్నానంబున బవిత్రమైన యీ పురంధ్రీమణి కొప్పువిచ్చి కేశజాలంబులు కేలంబట్టి నిండుసభను కట్టుపుట్టంబులూడ్చి విగతవస్త్రను జేయ బ్రయత్నించిన ఆ దుష్టాత్ముని దుశ్శాసనుని హృదయంబు చీల్చి తద్రుధిరంబునందీ మానినీమణి వెంట్రుకలద్దిముడుచు కాలంబు సమీపించునంతవరకీ శమీవృక్షమున విశ్రమించుకొనియుండుము. ఈ అజ్ఞాతవత్సరంబెటులైనను గడచువరకు భీముడు నిను వదలియుండినను సహోరాత్రంబులు నీ నామస్మరణ మరవడని తెలియుము. గదాయుధమా! నీకిదే వందనంబులిడెద నను మరవకుము.

( అనుచు గదాయుధము క్రిందబెట్టును. )

ధర్మజుడు:—(అర్జునింజూచి) అర్జునా! నిఖిలయోధ ప్రాణానిల పన్నగము మాడ్కి రంజిల్లు నీ గాండీవము నిచటనిడుము.

అర్జునుడు:—అగ్రజా! నీ యాజ్ఞాధారకుడను. నీ యానతి శిరసావహించి చేసెద. (అనుచు గాండీవమెత్తి)



కం॥ ఖాండవమున రిపుకాండము
చెండాడెడు నిన్ను క్రీడిచేఁబడి వదలున్
గాండీవమా యొకవర్షము
నిండెడునందాక నీవు నిలుపుము యిచటన్.

అఖండవిప్రఖాండ గర్వాపహారకమై గాండీవి దోర్దండమున మండితమగు గాండీవమా! యీ నరుడు కేవల నరసామాన్యుడై యొకయేడు నిన్ను వదలును. యత్నములేక వదలును. కృతఘ్నుడు వీడని నన్ను దూషింపకు. మున్ను ఖాండవవనదహనంబునకై యగ్నిదేవుని యాదేశంబున వరుణుని కరుణచే వరంబు గనిర్వబడిన నిన్ను నే మరతునా! నీ యవ్యాజసాహాయ్యంబున గాదె నాఁడా యింద్రునైన సరకుసేయక ఖాండవవనంబు గాల్చితిని. నీ బలగర్వంబున గాదె యుత్తర దిగ్విజయంబున ప్రాగ్జ్యోతిష పురాధీశు గర్వమడంచి బృహంతుని రాజితుఁజేసి సేనాబిందుని జయించి పార్వతేయుల నోడించి సింహపురంబు సాధించి అపరిమిత వస్తువాహన జాలంబు గొనివచ్చితి. నీ యాధిక్యము గదా కాదె మున్ను పురహరుడు కిరాతరూపంబు దాల్చి నన్నెదిరినపుడు హరుశరములకన్న నరుశరములతీక్ష్ణము హెచ్చను కీర్తిగాంచి పాశుపతాస్త్రంబు వరంబుగ బడసితి. నాకులకునెల్ల కాలంబు వ్యాకులము గలిగించు నివాతకవచులను నీ సహాయ్యంబున గాదె జయించి నిలింపాధీశుని కరుణకు పాత్రుడనై నిఖిలశర నైపుణ్యంబు నేర్చితి. దుర్వినీతుండగు దుర్యోధనుని దారపుత్రాదులతో చిత్రసేనుడను గంధర్వరాజు చెరగొని యాకాశమార్గంబున బోవువేళ నా గంధర్వరాజు గర్వమడంచి దుర్యోధనుని బంధవిముక్తుని జేయించినది నీ సహాయ్య సంపదనుండి కాదె. యిట్టి నీ మహోపకృతి నే గలనైన మరతునా? రాత్రింబవళ్లు నిన్ను ధ్యానించుచు నీ నామస్మరణ చేయుచు నొకవత్సరంబు నీ వియోగంబు నైచియుండెద. గాండీవమా! నా వందనంబులంది యీ శమీవృక్షంబున నుండుము. (అనుచు గాండీవము క్రింద బెట్టును)

ధర్మజుడు:—(నకులసహదేవులం జూచి) సోదరులారా! మీ ఆయుధములెల్లను యిండుపుడు. వీనినెల్లకు దిర్చి శవాకృతిగానొనరించి కేశయుత చర్మంబు దెచ్చి మోపుగాగట్టి ఆ శమీవృక్ష సరసను మోసికొనిరండు.

నకుల సహదేవులు:—వానిని మోసికొని పాండవులెల్లరు శమీవృక్షము చెంతకుంజని శమీవృక్షమునకు మ్రొక్కి.



ధర్మరాజు.- ఉ॥ మించిన భక్తి మ్రొక్కెద శమీనగరాజమ పుణ్యభూజమా
ప్రాంచితలీల నీ శరశరాసన భారము నీశిరంబుపై
నుంచెద గ్రీడి దప్ప మఱియొండురు వేరునుగాని దీనినిన్
గాంచిన బ్రేతరూపమును గన్పడఁ జేయుము నిన్ను వేడెదన్

(శమీవృక్షమెక్కి శరశరాసనములందుంచి దిగివచ్చును. పశులకాపరులిద్దరు ప్రవేశింతురు)

యల్లుగాడు:—ఓరీ మల్లా! మనగంగడింకెందును లేడు. అల్లదిగో జూడుము. యెవరో యాజంవి చెట్టుక్రింద నిలచినారు. వారెవరుందురు. ఇచట కేలవచ్చి యుందురు?

మల్లుగాడు:—అవునురా! యేమో చింతించువారివలె నగపడెదరు. యెల్లుగా! వారిం వొకఁడు రాక్షసునివలె నగపడెడు. ఓరె మాదిక్కు వచ్చుచున్నారు వాఁడు ము. మనమిచటనున్న నా రాక్షసుఁడు వచ్చి మ్రింగిన మనగతి యేమి. అయ్యో.

యల్లుగాడు:—మల్లుగా! తపిరికివాడవురా నీవు. అదిగో చూడుము ముందువచ్చువాడు తశాంతమూర్తిగ నగపడెడు. మనకే భయము లేదు. మనగంగని వెదకికొని పోదము.

( పాండవులు సమీపించి )

ధర్మరాజు:—( పసులకాపరులంజూచి ) ఓరీ! గోపాలకులారా! ఈ ప్రాంత్యంబున నీరిక సంవత్సరము వఱకు సంచరింపకుడి. మా వృద్ధమాత చనిపోయినందున మా కులపద్ధతిరీతి నీ జంబివృక్షమున వ్రేలగట్టితిమి. మీరెవ్వరైన యీ వృక్షము సమీపించితిరేని మీయందు భూతావేశమై మీరు శ్రమపడుదురు.

యల్లుగాడు:—( వడఁకుచు ) అయ్యలారా! ఇఁకముందీ దిక్కునకే మేము సంచరింపము.

మల్లుగాడు:—యల్లుగా! నాకేమో తలదిరుగుచున్నది. దయ్యమిపుడే పట్టెనో యేమో? అబ్బా! ఏమలె యల్లుగా! బాగున్నది.

యల్లుగాడు:—మల్లుగా! అట్లైన గంగడే గంగలో పోయిననేమి. మనము త్వరలో పురిఁ జేరుదము రమ్ము.

( నిష్క్రమింతురు. )



# విరాటపర్వము

## కీచకవధ

ద్వితీయాంకము - ప్రథమరంగము.

దుర్యోధనుని సభ.

(దుర్యోధన దుశ్శాసన కర్ణ శకుని అశ్వత్థామ ద్రోణులు. భీష్ముడు)

దుర్యోధనుడు:— అనుబంధము 15.

సీ॥ నారలుగట్టుచు కూరలాహారంబుగా
సుండి కానలోఁ గష్టపడిరి
ఘోరాటవులలోన క్రూరమృగాదుల
బాధ లెవ్వియులేక బ్రతికినారు
గహనాంతరంబులఁ గ్రవ్యాదులకుఁ జిక్కి
దక్కక ప్రాణాన దక్కినారు
శీతవాతాతపవ్రాతము లంటక
చెలగుచు జీవనచెలగి నారు

గీ॥ నేనొనర్చినకడు బాధలెవ్వి గాని
పాండవులపాలి భాగ్యాతి ఫలములగుచు
నెగడుచున్నవి అవి గని నేను
మనగనోప ధాత్రిని నాకెద్ది త్రోవచకట.

తాతా! మీవంటి మహనీయులు ద్రోణ కృపాశ్వత్థామలంబోలిన విద్యాధనులు కర్ణునిబోలు భుజసత్వ దివ్యాస్త్రనిపుణులు శకునింబోలు మాయావిశార



దులు యుండియు నన్ను గూడియుండియు నాకు ఆజన్మవైరులైన పాండవుల గూఢవాస విశేషము గాకయున్నది. మా బాధలన్నియు వారి కన్నె నాసి హెచ్చు చేయుచున్నవి. పండ్రెండువత్సరంబులు ఘోరాటవులలో గ్రుమ్మరుచున్నను వారి భుజసత్వము తప తప్పనాయెను. అర్జునుడు మహేశ్వరునోర్చి పాశుపతాస్త్రంబు బడసెనని వినిననాటినుండి నా మానసము అగ్నిలోఁబడి తపించులాగు కాలుచున్నది. ఇట్టివారు అజ్ఞాతవాసంబు సలుపుట సులభసాధ్యంబు. అజ్ఞాతవాస సంవత్సరంబు మీరినతోడనే పాండవులువచ్చి తమపైతృకభాగం బిమ్మని వాదింతురు. వారికి రాజ్యంబిన్నే నోపను. దానినుండి ఉభయకులంబులవారికి కలహంబు పెనగును. అందు జయాపజయంబులు దైవాధీనములై యుండును. కావున నిట్టి అనర్థములు సంభవించుటకుముందే అజ్ఞాతవాసంబున నున్నవారిని గనిపెట్టి ప్రతిజ్ఞ జెప్పిన మేరల మరల ద్వాదశవత్సరములు వనవాసం బొనర్చునటుల చేయుట శ్రేయమని నాకుదోచెను.

తాతా! పాండవులు ద్రౌపదియును యెచటనున్నవారోయని వెదకగోను రాను పంపిన వేగులవారు నేటికి రాకుండిరి. వారి యునికిపట్టు తెలియుదారియే యని చింతించుచున్నాను.

( వేగులవారి ప్రవేశము )

వారిలోనొకడు:— మహాప్రభూ! జోహారులొనర్చెద. తమయాజ్ఞను శిరసావహించి యే యుపేక్షయు లేక సమస్తదేశంబులు గ్రుమ్మరితిమి. వివిధ ప్రాకారంబుల పట్టణంబులు పల్లెలు గిరిగుహలు అరణ్యములు సముద్రతీరములు వెదకి వెదకి వేసరితిమి. వారియునికి తెలియుట దుర్ఘటమయ్యెను.

దుర్యోధనుడు:— ఆహా! యింతరిన్ని విధముల వెదకినను ఆ పాండవులు దొరకరయ్యెగా? సభాసదులారా! ఆ కుంతీనందను లెచటనుండునది మీ కెరింగిన తెలుగు నూహించి తెలుపుదురని నే వేడికొనియెద.

కర్ణుడు:— దుర్యోధనా! ఈ లేనిపోని దేహాలంపటమును మానసవ్యాకులము నీకేల? ఆ పాండవాధములు అజ్ఞాతవాసంబు సురక్షితముగ సలిపివచ్చి యేమియును ధరింతురు? వనవాసక్లేశంబున గిరిగహ్వరంబునంబడి చచ్చిరో; భోజనంబున

దుర్లేక నదియందు మడిసిరో; క్రూరమృగావళినోట జిక్కి చచ్చిరో; తెలియక యున్నది. దైవవశంబున యిన్నియాపదలు దప్పించుకొని వచ్చిరిపో వారికి రాజ్యములభించునా? మనమేమి పౌరుషహీనులమా? భీముని గర్వమార్ప నీవుజాలవా. పార్థుని పరిమార్ప నేజాలనా? ధర్మజ నకుల సహదేవుల గీటడగిప మనదుశ్శాసన సౌబలులు చాలరా? సూర్యునిబోలె భూరితేజోనిధివై కౌరవ సమాజాంబుజములను హర్షింపజేయక ఆ నరాధములకై నీవు భీతిల్లెదవేల?

అనుబంధము 17.

అశ్వత్థామ:—(కోపమున లేచి)

ఉ॥ పలుకుదు కర్ణ రజ్జులిక వచ్చెడివాదధనుంజయుంపు, మా
యలసోగటాల పందెపుజయంబును రీతిజయంబు సాధ్యమే
పాలటీ యిగోష్ఠ్యాం పట్టిసభబట్టము వల్చినభంగినాలముకా
సులభమె? క్రీడివిక్రమము జూడవె మొన్న నె ఘోషయాత్రలోన్.

ఓరీ సూతసూనా! నా యెదుట నానీరజ్జువులు. నిన్ను తలదన్ను అర్జుని శస్త్ర నైపుణ్యమునకు నీవాగగలవా? పాంచాలిపరిణయంబున పార్థును నెదిరించి నీవు పరుగిడనా? మనయీకురుభూషణుని చిత్రసేనుడను గంధర్వుడు బంధించిన సమయమున నీవు లేవా? ఆ మహానుభావుండు నరుండుగదా. దుర్యోధనుని బంధవిముక్తుం జేసి కౌరవకులంబునకుం గలిగిన అపయశంబు దోలిచెను. (దుర్యోధనునిజూచి) దుర్యోధనా? ఈ కులహీనుని మాటలునమ్మి నీవేపని యుజేయకు.

కం॥ తనకొలది యెదిటికొలదియు
గనకయవాచ్యంబు లాడెగర్ణుండకటా
వినదగునే యీమాటలు
కనదగునే హీనజనన కలుషాత్మకునిన్.

దుర్యోధనా యిట్టి హీనాధముండా యా నరుని యెదురించునది



యెంగిలికూడుదిని కండకావరమెక్కి భండనము లేనియపుడు యెవ్వరినీ సరకు సేయక ప్రల్లదములాడుచుండును. భండన సమయమెదురైనపుడు కాళ్ళకుబుద్ధి చెప్పి పరుగిడును. వీనిమాటలు సరకుసేయక ఆ పాండవులం గనిపెట్టి నీకు దోచిన యుపాయంబు గల్పుము.

కర్ణుడు:—(కోపమున లేచి) గురునందనా! ఈ బాపనపశువు పలుకు భండనపుమాటలచ్చిక రావు.

గీ॥ కౌరవపురునకుతగినట్టి పౌరుషంబు
ఏలరు విరియించు బాపనబాలకునకు
తద్దినంబులు చేయించి తనరుచుండు
పిండభక్షకులను నేల భండనమ్ము.

(అశ్వత్థామనుజూచి) ఓరీ! బ్రాహ్మణబాలకా! మిమ్ముమున్నగానక తల తోక తెలియంగక పొగరుపోతువై నన్నెదిరించి మాటలాడితివి. రమ్ము. నిన్ను సమయించి చిరంజీవి నీవని ఆసమనేత్రుండిచ్చిన వరము వ్యర్థపఱచెద.

అశ్వత్థామ:— అనుబంధము 18.

ఓరీ! కర్ణా! నీవు కులము తెలియక నోటిక్రొవ్వున మాటలాడెదవేల? నీకు లాఘవమైన శౌర్యంబునకు నీవు చాలుదువుగాని భండనంబునకు నీవుచాలడవుగావు. రమ్ము. నిన్నుపరిశోధించి ఆ నరునిశపథంబు వ్యర్థపఱచెద.

దుర్యోధనుడు:— అనుబంధము 19.

అశ్వత్థామా! నీకు వందనంబులిడెద. నెమ్మదిగ గూర్చుండుము. (కర్ణునింజూచి) కర్ణా! ఈరీతి మనలో మనము బోరుచుండిన కార్యంబెటు సాధింపనగును. (భీష్మునింజూచి) తాతా! నేనడిగినప్రశ్న వీరివురిపోరులో మునిగిపోయెను. ఆ పాండవులను గనుట దుర్ఘటమైనది. దీనికి సదుపాయంబు నీవు దెలుపుదువని నినువేడెద.

భీష్ముడు:— సీ॥ చలమేలవలదన్న కులముపాడగునన్న
కలుషవర్తనమెన్ని కలుపకన్న

శుక్రాచార్యులు:—అయ్యా! వాచస్పత్యాచార్యులు! ఆ కంకుభట్టు విద్యావంతుండే కాక టిరమే గాక కర్ణునంతటి దానశీలుండయ్యా! మనదొరగారు అతనివిద్యకు మెచ్చి యెంతధనంబిచ్చినను ఆ ధనము నతండు బ్రాహ్మణులకు బంచిపెట్టుచుండును. విప్రులను గౌరవించుచుండును. బ్రాహ్మణుండెంతటి బాలుండైనను వానిపాదములంటి నమస్కరించును.

వాచస్పతి:—అవునయ్యా! అతండు ధర్మరాజునంతటి ధర్మాత్ముడని నాకుందోచెడు. అతనివద్ద మరియొక విద్యగలదు చూచితివియా?

శుక్రాచార్యులు:—ఏమయ్యాయది?

వాచస్పతి:—పాచికలాడువిషయములో నతండు ననన్యసామాన్య సామర్థ్యంబుకలవాండట. మనరాజతనితోం బాచికలాడుచుం గాలక్షేపము చేయుచుండును.

( గురు వెంకటబోగయ ప్రవేశము. )

ఏమి గురువెంకటా; ఏమో చింతలోమునిగినట్లున్నావు? కారణమేమి?

గురువెంకట:—ఏమని చెప్పుదునండీ! రాజుగారియింట వంటలయధికారంబు నాకుం దప్పెను. ఎవండో యేదేశమునుండో యొకండువచ్చినాడు. వానిపేరు వలలుండట. వానికిం బాకశాలాధికారమంతయునిచ్చి నేను మఱికొందరు వాని చేతిక్రింద వాడు చెప్పినమాటలు వినుచు తక్కలబలెం బడియుండవలెనంట. వాండా రాక్షసునిబలె నున్నవాడు. వానిముఖముం జూచిన నా శరీరమెల్ల గడగడ వడకెత్తుచున్నది. వానితల్లి యేమితిని వానిం గనినదో తెలియదు. ఎంత సామర్థ్యమయ్యా వానిది. కట్టెలు తక్కువయ్యెనేని చేతితో పెద్దపెద్దచెట్లు విఱచితెచ్చి పొయ్యిక్రిందం బెట్టును. అగ్నిదేవుండునైతము వానికి భయపడుచుండును. ఎందుకట్టెలుపెట్టి ఎంతకాలమో యూదుకొనిన నూదినను మండనియగ్గి వాండు పచ్చికట్టెలుపెట్టి మండమని యానతియిడుచు అంకెవేసినతోడనే గడగడవడకి మండును. వాండు వండినవంటను భుజించి మనరాజుగారు మెచ్చి యిది నలపాకమని పొగడి వానికి ధనమొసగుచుందురు. దానింజూచి నా కడుపులో మంట లెసంగును.

( శెట్టిమల్లయ్య ప్రవేశము. )



శుక్రాచార్యులు:—ఏమి మల్లయ్యా! ఏమిది. ఊగుచు కా[illegible]నేలలు పెండపారినవానిం బలె నడచుచున్నావు. కారణమేమి?

శెట్టిమల్లయ్య:—ఆచార్యులవారూ! నేనేమని పలుకుదు. నాకు నేండు మా రాజుగారియెదుట మిక్కిలి అవమానమాయెను. ఏదేశమునుండియో మల్లవిద్యలో ప్రవీణుండైన జెట్టియొకండు వచ్చి ప్రపంచమునను జెట్టియెవండేని తన్ను కుస్తీలో గెలిచినయెడల బ్రదికినన్నిదినములు వానియింట నీళ్లు మోయుచుందునని రాజుగారియెదుట సర్వోత్కృష్టులు పలికెను. మనరాజుగారు మన్ననలందిన జెట్టింసందఱిని నన్ను బిలిపించెను. మొదట వారంతరిపై యధికారిగనున్న నన్ను వాండు కుస్తీలో గెడపి నా కాలిలో బిరుదుగా వేసికొనిన గండపెండారము పెఱికి పారవైచెను. నే జచ్చినట్లుగం బడితిని. మనరాజుగారిమోము తెల్లబారెను. ఆ పాడుజెట్టి నల్లచలిచి తొడలు తట్టుకొనుచు తనంతటిజెట్టి మత్స్యదేశంబున లేడని జయపత్రిక యిమ్మని అంకెంబలె కేకవేసెను. నూతనముగవచ్చి యాస్థానముంజేరిన కంకుభట్టువారు రేపటి సాయంకాలములోనెవండు వానితోం బోరాడుజెట్టి కానకయున్న జయపత్రిక యిప్పించెదమని మాటయిచ్చినారు.

( నటి ప్రవేశము. )

నటి:—దండమండీ! ఆచార్యులవారూ.

వాచస్పతి:—శుభశోభనప్రాప్తిరస్తు! ఏమి సైరంధ్రీ నీపని చక్కగా జరుగుచున్నదియా? మనరాజుగారి కొమార్తె యుత్తరకు నటనవిద్య చక్కగా గఱపుచున్నావా? మనరాణి నీకు ధనమిచ్చి ఆదరించుచున్నదియా?

నటి:—అయ్యా! నేనేమని పలుకుదును. ఎచ్చటినుండియో నాట్యవిద్యా ప్రవీణయగు నొకతెవచ్చి నా స్థానమాక్రమించెను. దానిపేరు బృహన్నలయంట. దాని రూపమొక్కతీరుగా నున్నయది. అది పురుషరూపముగాదు. స్త్రీరూపము గాదు. నటనవిద్యలో ప్రవీణురాలనుటకు సందియము లేదు. అదియిపు[illegible]రను శిక్షించుచున్నయది. ఇంక సుదేష్ణయొద్ద నేమి కావృత్తి నుం[illegible] యున్నదియంతయు మాలినియనెడి యొక సైరంధ్రివచ్చి మనరాజుగారి సా్త్రీ

యించి ఆయమ మన్ననలందుచున్నయది. నాకు ముందుదారిం దోపక యున్నది.

శుక్రాచారి:—నీకేలచింత! నిందుజప్వనమున్నది. పట్టణమెల్ల ధనవంతులగు వయసు కాండ్రున్నారు. ఏదోయొకరీతిగ గాలక్షేపము చేయగలవు. చింతింపకు.

వాచస్పతి:—శుక్రాచార్యులలారా! సూర్యాస్తమయమైనది. సంధ్యావందనమునకు తటాకమునకు వెళ్లుదము.

(నిష్క్రమము.)

## తృ తీ య రం గ ము.

## వి ర టు ని స భ.

విరటుఁడు - కంకుభట్లు - వాచస్పత్యాచార్యులు - మంత్రి సుకీర్తి

జెట్టి ప్రతాపుడు - జెట్టి వీరసింగు.

విరటుఁడు:— అ ను బం ధ ము 20.

అయ్యా! కంకుభట్లూ! మీరు ధర్మరాజా సరసనుండి ధర్మసూక్ష్మము వాదంబులను సమయవినోదంబులను సల్పుచుంటిమని పలికితిరే. ఆ ధర్మ రాజాదులు కౌరవకల్పిత మాయాజూదంబున తమసర్వస్వమునోడి ద్వాదశ వత్సరంబుల వనవాసంబున ఖిన్నులై బడలి యిపుడీ యజ్ఞాతవత్సరంబున నెందుఁజేరిరో? ఎటులున్నవారో! భీముఁడు తనశౌర్యంబెటు దాచెనో? అర్జునుండు తనతేజంబెచట దాచిపెట్టెనో? సుకుమారులగు మాద్రీతనయులు గాసిలి యెన్నియిడుములు గుడుచుచున్నవారో? ఆ పతివ్రతాశిరోమణి ద్రుపదనందన యే దుర్మార్గునిచే నెన్నియవస్థలు బడుచున్నయదో యోచింపఁగరాకయున్నయది. ఆయ్యో! ఎంతటి సుచరిత్రులకు నా దురాత్ముఁడగు దుర్యోధనునుండి యెన్నికష్టము లొనఁగూడెను?

కంకుభట్లు:—మహీపాలా! మానవునకు సుఖదుఃఖములు రెండును సామాన్యానుభవ నియములని శాస్త్రములలో ఘోషించుచున్నయవి. అయినను తెలివిగల మానవుడు తనబుద్ధిబలిమిచే కష్టములను తగ్గించుకొని సుఖానుభవము హెచ్చింపఁజేసికొన వలెనుగదా. ఇట్టి ధర్మసూక్ష్మములన్ని దెలిసియు కప



టద్యూతంబున బుద్ధిపూర్వకంబుగ దనసిరినంతయు నోడుటయగాక సరి తమ్ములనోడి వీరపతివ్రతామణిని అగ్నిసాక్షిగఁ బెండ్లియాడినభార్యను ద్యూతముఖంబున నోడెను. అట్టి బుద్ధిహీనుఁడగు ధర్మజునకు నీవేల యింత గుందెదవు?

విరటుఁడు:—కంకుభట్టా! విధికృతంబు దుర్వారంబుగాదా? దుర్విధిప్రేరేప ధర్మజుఁడు దుర్యోధనునితో ద్యూతంబాడ నొడంబడెనుగాని బుద్ధిపూర్వకంబుగ నాడెనా?

కంకుభట్లు:—అట్టిసమయములందుగదా మనుజుఁడు తనబుద్ధివెచ్చించి యోగామును నిర్ధరించి కీడుమేళ్లు యోచించి పనిసేయవలెను. అటు చేయఁడేని వాడు మను జుఁడెటులగు. పశుసమానుఁడుగాడా?

(జెట్టి ప్రతాపుఁడు ప్రవేశము.)

ప్రత :—(వచ్చి విరటునికి వందనంబిడి భుజాస్ఫాలనంబొనరించి) మహీపాల శిఖా మణీ! ఈనేలనాల్గుచెఱఁగుల నృపులకొలువుకూటములందుండు జెట్టీలనెల్ల గుట్ట డగించితి. ఇపుడు తమకొలువుకూటమునందలి మల్లులనెల్ల సమయించితి. మహీ నాథా! నాతోపోరాడు జెట్టి తమదేశంబునలేడని నాకొక జయపత్రిక వ్రాసి యిచ్చినజాలు. నాగదిరొము పదివేలని యెంచినేఁ బ్రయాణమయ్యెద.

విరటుఁడు:—(కంకుభట్లంజూచి) కంకుభట్లూ! ఈ జెట్టిమాట నిజమని నాకుందోచెడు వీనితోఁ బోరాడువారు మనపురిని లేరు. కావున వీనికి జయపత్రికయిచ్చుట విధాయకమనిఁ దోచెడు.

కంకుభట్లు:—మహీపాలా! ఇంచుక నెమ్మదించుము. ఇటీవల తమసేవకావృత్తిఁజేరిన వలలుఁడను పాకశాసనాధికారి వీనితోఁ బోరాడనోపును. ధర్మరాజు సరస నేనుండునపుడ నేతులగు జెట్టీలతోఁ బోరాడి వారిని రూపు మాపెను. వాఁడు గజాయుత సత్వసంపన్నుఁడు. వానిఁ బిలిపించితిరేని ఈ జెట్టితోఁ బోరాడనోపునని నా నమ్మిక.

విరటుఁడు:—ఏమీ! వలలుఁడంతటి బలాఢ్యుఁడా అటులైన వానిం బిలిపించెద.

(ఓరీ భటాయని భటుని బిలుచును.)

భటుఁడు:—చిత్తము మహాప్రభో.

విరటుఁడు:—ఓరీ! భటా! నీవు వేగమ్మ పాకశాలకుఁ బోయి వలలు నిచటికిఁ బిలిచి కొనిరమ్ము.

భటుఁడు:—చిత్తము (నిష్క్రమించును.)

( వలలుని ప్రవేశము. )

వలలుఁడు:—మహీపాలా! వందనంబులు. ఆస్థానంబునకు నన్నిప్పుడు పిలిపించిన కారణంబేమి?

విరటుఁడు:—వలలా! ఈ జెట్టి (వానిని వ్రేలఁజూపి) ప్రపంచంబునగల మల్లులనందరిని మల్లయుద్ధంబుల నోడించెనఁట. నా పోష్యవర్గంబున నుండిన జెట్టీలనెల్లర గర్వమడంచెను. తనకు సమానుఁడగు మల్లుఁడెవఁడీ మత్స్యదేశంబున లేడని జయపత్రికయిమ్మని యడుగుచున్నవాఁడు. నీవు మల్లయుద్ధంబు నందారితేరినవాఁడవని మనకంకుభట్లు వచించెను. కావున నిన్ను పిలిపించితిని. నీవి జెట్టితో మల్లయుద్ధంబు సలుపఁగలవా?

వలలుఁడు:- ( మౌనమూని యుండును. )

కంకుభట్లు:— ఏమి వలలా! ఇటుల సందియించుచు మౌనమూనితివి? నీ బలంబు రాజ వినోదార్థంబుగ బయల్పఱచుట నింద్యము కాదు.

వలలుఁడు:—(విరటునిఁజూచి) మానవనాథా! తమయానతి శిరసావహించి యీ వలలుఁడు తన యాహారసంబును వీరరసంబును ఘోరంబుగ బ్రకటించుచు పోరున తనబీరంబు చూపయత్నించెదను. నన్నుఁజేరి మీరిపోవు జెట్టీ యెవఁడో వాఁడు ముందరికి రానిమ్ము. వానినొసటను విధాత వ్రాసినవ్రాతలోని తుదిపత్తి నేటితో సమాప్తమగును.

జెట్టి —( భుజాస్ఫాలన మొనర్చుచు) ఓరీ! రాజుగారి సొమ్ము యిచ్చకములాడి దు రిచ్ఛానుసారము కడుపు బీఱలాగున భక్ష్యభోజ్యములు తిని కండ పెంచుకొనిన మాత్రమున చిన్నతనంబునుండి మల్లబంధంబులెల్లను గురుముఖకముగ నేర్చి గురుతరాభ్యాసంబొనర్చి భూరికీర్తిఁగాంచిన నన్నెదిరింపఁగలవా? ఏలనీకీ వృథా శ్రమ. ధీరమ్ముమాని పోటునకు దూరమ్ముగ నుండుము.

వలలుఁడు:—ఓరీ! ప్రల్లదంబులచే నీ పౌరుషంబు ప్రకటింపకు. ప్రబలంబగు బలంబు నీకుఁ గలదేని హెచ్చుపలుకులు పలుకక నన్నెదిరి నీ బిఱుసుపరుస తనము



చూపుము కాదేని శరణాగతుఁడవై నా కాళ్ళపైబడి "జీవన్భద్రాణిపశ్యతి" యనురీతి బ్రతికియుండుము.

జెట్టి:—( భుజాస్ఫాలన మొనరించి ) ఓరీ! మూర్ఖా! నాయెదుటనిలచి భయపడక యిన్నిమాటలాడినవాఁడని నేనెందును జూడలేదు. మంచిది నీ పొగరుడఁచి నిన్ను చూపుమాపెద.

(అనుచు మల్లయుద్ధంబొనర్చుచుండ భీముఁడు జెట్టిపైకెగసి వానికాలందొడిగిన గండపెండారము తెంచి పారవైచుట. )

సభాసదులు:—సెబాసు వలలా! సెబాసు వలలా! ( అనుచు కేకవేయుచుండు జెట్టి లేచి తలవంచికొని చేతులు నులుముకొనుచు వెళ్ళిపోవును )

విరాటుఁడు:—వలలా! నీ బలంబునకు నే మెచ్చితి. నాకొక్కనికేగాదు. నా దేశంబునకే కీర్తి తెచ్చితివి. నిన్నెంతపొగడినను చాలదు. ఇఁకముందు నీకుఁ దీక్ష యుండినపుడెల్ల నా యాస్థానము నలంకరించుచుండుము. నీకువలయునంత ధనంబిచ్చునటుల ధనభాండాగారాధిపతికి నాజ్ఞయిచ్చెద.

( కంకుభట్టుఁ జూచి. )

కంకుభట్టూ! నేఁడు సుదినము. మన దేశమునకు కీర్తి వచ్చెను. కావున మన యధికారులందరు హాయిగ సుఖమనుభవింప సెలవొసంగితి. మనము పాచికలాడుచు ప్రొద్దుగడుపుదము రమ్ము.

( నిష్క్రమణము. )




# విరాటపర్వము
# కీచకవధ

తృతీయాంకము ప్రథమరంగము.

ఉద్యానవనము.

ఉత్తర - సుధేష్ణ - సఖులిరువురు (కలభాషిణి మధురలాలస) మాలిని - కీచకుడు.

సుధేష్ణ.— అనుబంధము 21.

రగడ

ఉత్తర:— అమ్మకనవే సౌరభమ్ముల నలరునలరులు కొమ్మకొమ్మకు
కలభాషిణి:—నిమ్మలనుగొని పోదమటు దా నమ్మలకు నికనమ్మలంపకు
మధురలాస:--బాలనేలను వాలకిటులటు బండికొని తినుమావి పంటని
ఉత్తర:—కేలుసాచుచు నందికొమ్మా కీలెటేగిముక్కంటి పంటిని
కలభాషి:—గోటగిల్లకె క్రొవ్విసీవిటు కోమలాంగిరొ ఖేత మరువము
మధురలా:—చాటి తెల్పెద వీనినంటవె చానచెల్లును నీదుగరువము
ఉత్తర:—అన్నుమిన్నా పొన్నపూవులు నందుసేమోనిక్కిచూడవె
కలభా.—సన్నుతాంగిరొనిన్ను నెత్తెద జక్కగానవికనుచుగోయవె
మధుర.—మేలుమేలిది యెంతతెంపరి - మీదికొమ్మను బట్టివెసజని
ఉత్తర.—చాలుచాలిక ననలుగొను పనిచల్లగా గూర్చుందమటజని.

సుధేష్ణ:— చెలులారా వనవిహారంబున నలసితిరి (ఉత్తరంగాంచి) బిడ్డా ఉత్తరా! ఇది వసంతఋతువుకదా? నీ నవీనోపాధ్యాయుండీ ఋతువునుగురించి యేదయిన పాట గఱపియుండినచో దానిని బాడుము.



ఉత్తర:—అటులనే పాడెద

అనుబంధము 22.

ఉ॥ మంజులగుంజముల్నెఱపు మత్తమధువ్రత జృంభమంటగా
సంజచలించుమందమలయానిల సంగతిదూగిక్రాగి దా
గంజమకరందమిష గార్చును నశ్రుపుతారకామిగా
రంజిలుచూతగుచ్ఛమదె రమ్యవసంతవినోదయంబునన్.

సుధేష్ణ:—సఖులారా! వింటిరియా. ఈ వర్ణన మానసంబునకెంత యాహ్లాదకరంబుగ నున్నది. ఎంతటిమహిమాస్పదంబులీ మధుమాసవాసరంబులు మత్తమధువ్రతముల పాలిటె నిత్యోత్సవంబులు. కంటిసరంబులు మత్తమధువ్రతముల పాలిటి నిత్యోత్సవంబులు. కంటిరియా! యీ భృంగీభృంగముల సంతసంబులు!

తే॥ కావులపుష్ప రేణువుల మానగుపాదుల యంతరంబులన్
దావిజెలంగు సూనరసధార సుమస్థవమెక్కిపోయిగా
భావభవస్తవంబులను బాడుచుభృంగము కాంతజేరుచున్
మోవినినున్న తేనియనుముద్దుల బీల్చుచుసంతసిల్లెడున్.

కలభాషిణి:—సుధేష్ణా! దంపతుల ముచ్చటలెంత మనోహరముగ వర్ణించితివి. ఇటు చూడుమా! ఈ భృంగీభృంగములు భంగురభోగానుభవంబున నిక్కినీల్గుచున్నవి.

అనుబంధము 23.

తే॥ పద్మపాళిమధూళిమబరగగ్రోలి
హాళిమధుపాళిసుఖకేళిదేలెగనుమ

మధురలాసన:--ఇంతిరసధాళిధన్వికి నీసదాళి
నారియైగాదె సుమపాళినారినేచు.

సుధేష్ణ:—సఖులారా! ఆ సుశీతల సురసాలచ్ఛాయంగల తావులు తావులచే శోభాయమానమైనవి. మనమచటికిజని విశ్రమించుకొందము. మనమాలిని యుందుండు మల్లెలంగొని సరములుగూర్చుకొనివచ్చును.

కలభాషిణి:—సఖులారా! అట్లొనర్తము రండు.

(మాలినిదక్క మిగతవారు నిష్క్రమింతురు)

మాలిని.—సీ॥ ద్రుపద మహీనాథుదుహితఁ బాండవతతికిఁ
వనితలములఁబడి వనటఁగుందె
అసమానవిక్రము లసమానులగువారు
తనయులసతియైన దశరథునకుఁ
త్రిజగంబులను మోయు త్రిదశేంద్రుసరదుని
సోదరికష్టాబ్ధి గ్రుంకె ను
సేవకురాలై రాజ సీమంతినులుగల
తరుణికిఁబ్రాప్తిల్లె దాస్యవృత్తి

గీ॥ వైరయోగంబు ధాత్రిపాటనగునె
ధాతవ్రాతను దప్పింపఁ దరమె నాకు
పూర్వజన్మానుఫలము నింపొందగాను
ననుభవించెద దుఃఖంపుననుచెయటకట.

ఆహా! విధికృతంబుదుర్వారంబు. వగచి ప్రయోజనంబేమి? దైవమా! రిత్త రాజ వధూమణుల దాస్యమునకు నలవడిన ద్రుపదనందన పరరాజభామినీ పదసేవకు లోబడెనుగదా? రాజసూయాధ్వరంబున నలుదిక్కుల నవలీలగ జయించిన మహావీరులొక రాజాధమునింట నిలువదగినకాలము సంప్రాప్తిల్లెనుగదా? ఎంతదుఃఖించి యేమిప్రయోజనము? ఇంతవరకుగంధంబు దీయుటచే చేతులు నొవ్వలుపట్టెను. ఇపుడు పూలుఁగోసి హారంబు గట్టుమని నన్నేలుతాణిగారి యాజ్ఞయయినది. అట్లొనరించెద. (అనుచు పుద్యానవనంబున యొకమూలన గూర్చుండి పుష్పముల హారంబు గట్టుచుండును.)



## అనుబంధము 24.

(కీచకుని ప్రవేశము.)

కీచకు:—ఏమీ; నా సోదరీమణి సుధేష్ణ యీ పుద్యాన వనతలంబునందున్నదని దాసి పలికెను. ఇందెందును లేదే. లోపలనున్నదేమో చూచెద. (అనుచు మూడడుగులు ముందరికిబోయి మాలినిం జూచి విభ్రమపడి వెనుకకువచ్చి.)

అంబుజమో లేకయంబు జాతియోగాక
డంబుమీరినమిక్కుటంబో మోమొ
కలువలో చెలువమ్ముగల మీలో యలరుల
విలుకానియమ్ములో వీక్షణములో
పుల్గులగవయో మేల్పొగుత్తులో వైడి
కలశములో గాక చెలిచనుములో
రంగారుమించో యానింగిమించెడి చుక్కొ
బంగారులతయో శృంగారవతియో

గీ॥ మరులుగల్పించి నరులనునురులఁబోసు
మారధీవరుకరపాశమా వసరులో
గరగరికలాడునిరులో ముంగురులసిరులో
భామినియొగాక నాపాలిభాగ్యనిధియొ.

హా! హా! ఈ సుందరీమణి యెవతెయుండును. దీనిఁ జూచినంతమాత్రమున బర్వతమువంటి నాధైర్యము నీటికంటెను బలుచన పడిచెనుగదా? ఈ సతీ రూపంబ శ్రుతాదృష్టపూర్వంబని చెనమ్మెడ. ఇంద్రియనిగ్రహముగలిగి యతిసియతిఁబూనిన యెంతటియతి ముఖ్యుండైన నీ సతినిఁ జూచినక్షణముననె మనోవ్యాపారమున ప్రతిఘటినంది యతనుని శాతశరంబులఁగుంది తనుతాపంబందఁడా? ఈ జవ్వని యివ్వనియందేల నిలిచెనో తెలియదు. విప్రరుషుఁడీ తరుణిని వారఁగాఁగొని యింద్రభోగంబులెల్ల ననుభవించునున్నవాఁ

దో వానినొసటఁగల విధాతవ్రాత సువర్ణ వర్ణముల ఛాసిల్లుచున్న చికాఁబోలు! ఇట్టిరూపముగల నిండుజవ్వనిని కనుపండువుగఁజూచి తలయూఁచి మెచ్చియతను తాపంబునన్నొచ్చి పిచ్చివానిఁబలెఁ బల్కరింపక వెనుకకు పోవచ్చునా? ఇదియొంటరిగ నున్నది. నా సోదరి యిచట లేదు. ఈ సుందరి సరసకుఁబోయి పల్కరించెద.

( అనుచు ముందరికిఁబోయి )

నీరజాననా! జగదేకమోహినీ! సౌందర్యఖనీ! సరసలావణ్య వాహినీ! నేనిచట లాతివాఁడనుగాను. సుధేష్ణసోదరుఁడను. కీచకుఁడను. నీ పేరేమి? ననుజూచి మేను దాచికొనియెదవేల గడగడవడకెదవేల? చారునేత్రా! దూరముజనకు. మాటలాడుము.

( సైరంధ్రి దూరముగఁజని మౌనమూనియుండును. )

కీచకుఁడు:—జలజేక్షణా! నేనెంతపల్కరించినను మారుపలుకక మౌనమూనితివేల?

సీ॥ శతపత్రనేత్ర! నీ సితవీక్షణమ్ముల
బాయనల్లుఁ బర్వఁజేయవేల
సితకరానన! నీదుచెలువంపుమోము వె
న్నెలనాల్గుదిశలను నెఱపవేల
నవఫేనసమహాస! చిగురువాతెరవిప్ప
రాణించురవలేమిరాలు నేఁడు
ఇందిందిరాలకా! యిలజనుల్నినుఁ గడ
దృష్టి గాకునటంచు దిగులుపడితె
గీ॥ ఏలమోమటువంచెదే? యేలనన్ను
గాంచకిటువలెమూయుదే కన్నుగవయు
నేలపల్కవుచిలుకనగవెలమిచాటి
చలమునాపైన? నానోముఫలము! భామ:



భామామణీ! నీయుదంతంబంతయుం దెల్పి నామనము రంజిల్లఁజేయుము.

సైరంధ్రి:—కీచకా! పరదారలతోఁ బలుకులేల? అందున నేను సైరంధ్రివృత్తినిఁబూని నీ సోదరిసరస పరిచర్యలొనరించుచు హీనదాస్యమున మనుచున్నాను. నీ సోదరియానతి శిరసావహించి యిచటఁ బూలసరములు గూర్చుచున్నాను.

కీచకుఁడు:—సైరంధ్రీ! నీయంతటి జగదేకసుందరిని యీ పాడుదైవము సైరంధ్రీవృత్తికిఁదించెనా! వినుటకు నసహ్యముగనున్నదిరయే? కనులారఁజూచి నేనెటు లోర్చుఁగలను? భామా! ఈ దాస్యము నీకిఁకఁజెల్లదు. రమ్ము. నా యంతఃపుర స్త్రీరత్నమవై యుండుము. ఈ మలినవస్త్రములు యీ కఠినావని శయ్యయును నీయట్టి సుందరీమణికిఁ దగునా? రాజభోగార్హవునీవు. ప్రసాద దృష్టిచే నన్ను సంభావింపుము. దివ్యనవరత్న ఖచితమణిభూషణముల నిన్నలంకరింతును. సౌరభాన్వితమాల్య నిచయంబుల నిన్నుభూషింతును. చందన లేపనాదుల నిను గౌరవింతును. సుందరమందిరంబుల నిన్నుంతును. హంస శయ్యాసనంబుల నిన్ను సుఖింపఁజేయుదును. సుందరీమణీ! రుచిరాలంకారములుమాని మలినవస్త్రములూని యీడిగపుబనిఁబూని దేహమున్ శోషింపఁజేసి జవ్వనము రవిఁగాచిన వెన్నెలసామ్యంబొనర్చుట తగునా?

సైరంధ్రి:—నినుఁబోలు ధీరునకీబుద్ధి సమంజసముగాదు. పావకుని మ్రోల ప్రమాణంబొనర్చి పరిణయమైన పడతులనేకులు నీకుండ పరసతినపేక్షించుట పాపముకాదా? ఇందుండి నీకుఁగలుగు ఫలమేమి? పరదారనపేక్షించువాఁడు పాపకూపంబునఁబడి పొర్లడా? కీచకా! వలదీ దురాగతబుద్ధి. నిన్నువేడికొనియెద. పొమ్ము.

కీచకుఁడు:—తరుణీమణీ! తగవీనీతివాదములు. మగువా! మనసిజబాధల మానసము వ్యగ్రమ్ములగుచుండు మగవానియెదుట నా నీయిట్టిమాటలాడఁదగినది.

మ॥ అనురాగాంబుధి నన్నుముంచెఁ గదనీయందంబు; వేపచ్చునీ
తనువున్ దెప్పను జేర్చి తేల్పురమణీ! తాపంబు నేనోప; నే
మనసీసంగతిఁదప్పనిశ్చయము భామా! భాగ్యమా! నమ్ము మా
ఘనమా! నీవిటులాచరింపఁ? నను మా కల్యాణి! నన్ను

లలనామణీ! లాలనవచనజాలంబుల ననునూరడించి శీలాకేళిని దేల్పుము. మానవతీలలామా! బహుమాన పురస్సరదృష్టినను జూడుము. జగన్మోహినీ! ఈ జగతిననుభవానను యోగ్యయగు మగువ నినుదప్ప వేఱెవ్వరును లేరు. ఘన సౌందర్యవయశ్శాలిని వగు నిన్ను కన్నులారంజూచి యవ్వనజాసనుండైనను సంచలింపక నిలుచునా? విలాసవతీ! నీ తనూవిలాసములం జూచినతటినుండి నామనమతేను విలాసములకు నువ్విళ్లూరుచున్నది. రమణీమణీ! అనల్పకృతప యత్నము అతికృశపయత్నము మలినచేలా వృతమయ్యెను నామదినంతయు నీకే మదనునకప్పగించితిని. ఇంక నూతన కాంచనోజ్జ్వల మణిహారవిభూషితవై, చారుమహాలాంచితవై, సౌరభపూరితశీతలచందన చర్చిత చారుగాత్రవై నన్నేలంబూనినచో నా సుఖమెంతని కొనియాడనగును? వనజేక్షణా! సుఖాస్పదమగు యౌవనము ప్రవాహమువంటిది కాదా? చనినవెనుక మరలవచ్చునా? ఇవియన్నియును విచారించి యౌవనాఢ్యుండనగు ననుంగూడి యనుపమభోగ భాగ్యాన్వితవై నా సతులలో శిరోమణివై సౌఖ్యపిన్యమహిమంబుల సకలసార వరుల జయించిననన్ను నేలెడి రాణివై సుఖమున నుండుము. వైళమ్మె రమ్ము. విళంబమునకు కాలమ్ముకాదిది. ఈసమీపమ్మున నుండెడి యారామ్ము దూరి సుఖకేళిం దేలుదము.

అనుబంధము. 25

సైరంధ్రి:— కీచకా: పాతకికి మోక్షంబు దుర్లభంబగునటుల నీకుపరమ పతివ్రతనైన నేను దుర్లభను. నాపు గంధర్వులేవురు పతులుగానున్నవారు. వారెల్ల కాలంబు గోచరంబుగ నుండి నను రక్షింతురు. కావున నన్ను నీవు చెనకకు. ఇట్టి పాపకృత్యమునుండి నీకు చెడుగగును గాని మేలుగాదు.

సీ॥ భామను భంగింపం బాతాళకేతుండు
చెఱంబట్టి దుర్గతిం జెందెనన్న
అవనిజ బట్టిన యసురాధిపునిగతి
మదిభ్రమపడుచుట మాన్యమన్న



సతిదమయంతిని సంగతిం గోరక
పతితుభంగముంగాంచి బ్రదుకుమన్న
మునుపులోమశుబట్టి మృగాధమునిగతి
తలంచినైనను తాల్మి దాల్పుమన్న
గీ॥ అన్న ననుమానుమన్న యాయఘవిచార
మతిని వదలుము మనుమన్న మానితముగ
నీతిపథమును గనుమన్న నిన్ను చాల
నడిగికొని యెదవయం బ్రోవనరయుమన్న.

కీచకా! నీచిత్తము చిత్తజుని బాణములకు హత్తించి వివేకమునూని విప్రలాపంబులు బలికితివి. ఈ బుద్ధి నీకు తగదు. నామీదమనసు వదలుము. నీస్వస్త్రీల యందెల్ల కాలము మనసునిల్పి సుఖమున నుండుము. పరసతినిం గోరు దురాత్ముండవు గావలదు. దుష్టలోకులాడపలదు. నీసతులు నీ చేనె టుఱ్ఱ్యలగుదురో ఆత్మీయనసే పరసతులని తెలియుము. నిన్ను నీవేయుపమ్ముగాంగొని స్వధారలయందు సుఖముండి పరదారలకు పరాఙ్ముఖుండవు గమ్ము. గీవానులయందు తనివి చెందక చపలుండవై పరదారలయందు దుర్విచారపరుండవైతిరిగితివేని భూజనులెల్లరు నీ మరణముంగాంక్షించుచు నపింతురు. వేదవేదాంగ విదుండగు నీ తండ్రినివదలని విద్యకరణి పతివ్రతాధర్మము సతినివదలదు. కావున నీవీ కామవిమోహిత చిత్తుండవుగాక మందిరంబునకు వెడలుము. నేనిచటనుండజనను.

(లోనుండి మాలినీయనుశబ్దము వినవచ్చును)

అదిగో నా పేరనీ సోదరి పిలుచుచున్నది. [అనుచు వెళ్లిపోవును.]

కీచకుడు.— ఈశైశ్చరురాలు సుధేష్ణ నాసుఖ కంటకరాలై యాసుందరీమణిని పేరంబిలువనేల? అయ్యో చేకడివాదప్పెనుగదా? చేతదొరికిననాతి చేయి మించిపోయెను. మదనుని పదును ములుకులచే నామది కుమర చెడెను. మేరబాలు మార సుఖంబులు చూఱంగొనుటకు దూరమాయెను.

ఆరెవ్వా: ఆ బోటితనకింపు జవ్వన మటవీచంద్రికాన్యాయము సలుప్పట నాకలిసంకటకరముగ నున్నది.

అనుబంధము. 26.

ఇప్పుడు నేనిచట నిలుచుట సరికాదు పోయెద.

ద్వితీయరంగము.

కీచక-సుధేష్ణ.

( కీచకుండు చింతించుచు గూర్చునియుండును. )

సుధేష్ణ:— సోదరా! కీచకా! ఏమి యీరీతి చింతించుచుఁగూర్చుంటివి?

కీచక:— అక్కా: ఇప్పుడాయుద్యాన వనమునందుండి చనిన తరుణీమణి యెవతె?

సుధేష్ణ:— సోదరా! నీచింతకుఁగారణంబు దెలుపకయీ స్త్రీ విషయము విచారించెదవేల?

కీచక:— అక్కా ఆస్త్రీవిషయంబు నీవు దెలుపక నా చింతకుఁ గారణంబడిగెదవేల?

సుధేష్ణ:— (స్వగతము) వీడే మోస్మరాపస్మరతఁ బ్రేలుచున్నవాఁడు. (ప్రకాశముగ) కీచకా! ఏమియిటులమాటలాడెదవు? ఆస్త్రీనాదాసి● క్రొత్తగవచ్చి నాదాస్యమునఁ జేరినది.

కీచక:— ఏమీ! సుధేష్ణా. ఆ స్త్రీకి నీవుదాసివియా? ఆస్త్రీ సౌందర్యంబునకు నీవు దాసివియా?

సుధేష్ణ:— కీచకా! నిజముగ నా తరుణి సైరంధ్రీ వృత్తిఁబూని నాపరిచర్య సేయుచున్నది. దానిమాటలేల? ఇపుడెందుకిచటికి వచ్చితివి?

కీచకుఁడు:— అక్కా! ఆరూపవతి యేకతంబున ఆ యుద్యాన వనంబున నేకాంతంబుగఁగూర్చుండియుండెను.

సుధేష్ణ:— సోదరా! పూవులగోసి హారంబులు గట్టుటకై యాజ్ఞయిచ్చియుంటిని. అప్పనిసేయుచుండెను.

కీచక:—అక్కా! ఆజవ్వని నాకంఠంబునఁబూలహారము వేసి నన్నలంకరింప యత్నించుచున్నదియా! అటులైననే ధన్యుఁడనైతిని.

సుధేష్ణ:—సోదరా: ఆవ్యవస్థితచిత్తునింబలె మాటలాడుచున్నావు. ఏమికారణము?

కీచక:— ఏమికారణమునరా స్త్రీ నచ్చటినుండి పిలిచితివి?



సుధేష్ణ:—పనియుండి పిలిచితిని. ఆజోలినీకేల?

కీచక:—అన్నిజోలులువదలి యా లీలావతి కేళిం దేలియాడుటకు.

సుధేష్ణ:—కీచకా! ఇది మతముకాదు. మర్యాదకాదు. ఆబోటి నీచవృత్తినిమందు దాసి. అట్టిదానినినీవు కన్నెత్తియైనఁ జూడనగునా?

కీచకుఁడు:—అక్కా! అది దాసియైనమాత్రమున దాని సౌందర్యము పోయెనా? వెలగలవజ్రము తిప్పలోబడినదని మనము నిరాకరింతుమా?

సుధేష్ణ:—అంటరానివస్తు వెంతటి చక్కనిదైనను నింద్యముగదా?

కీచకు:—అక్కా! స్త్రీరత్నమంటరాని పదార్థమా?

సుధేష్ణ:—పరస్త్రీయట్టి పదార్థమేను.

కీచక:—అది స్వస్త్రీయయినయెడల.

సుధేష్ణ:—కీచకా! పరస్త్రీ స్వస్త్రీయెటులగును?

కీచక:—ప్రయత్నమున.

సుధేష్ణ:—పతివ్రతయందుఁ బ్రయత్నము కొనసాగునా?

కీచక:—సామదానప్రయత్నములు లభింపదేని దండనీతికి దుర్లభమా?

సుధేష్ణ:—అదిపాపమూలముగదా?

కీచకు:—మనోజతాపంబు చల్లార్చుట పాపమెటులగు?

సుధేష్ణ:—సోదరా! నీకిదిబుద్ధికాదు. ఆ సైరంధ్రి పతివ్రతా శిరోమణి. దానికి గంధర్వులేవురు పతులున్నవారు. పతివ్రతను పరిభవింపఁ బ్రయత్నించువాఁడు పురుషాధముఁడు. నీవావీరకూరుఁడవు. నీకీమతి హితముకాదు.

సీ॥ పరసతిఁగామింప సరసముగాదన్న
ప్రాణముపైవచ్చు పతులువిన్న
అపగతమతియయి యన్యాంగననుగోర

నకు సాహాయ్యమొనరింపుమని నన్నడిగెను? వానికిం బ్రీతిల్లి నేనియ్యకొంటిని. ఇత్తఱిదా పతివ్రతాశిరోమణిని సైరంధ్రిని యెటులా దురాత్మునింటికి పొమ్మని యాజ్ఞయిడుదును? వలదనినఁ గీచకునుండి రాజ్యమున కేవిపత్తు ప్రాప్తిలునో? ఏమియుందోపదు. (ఆలోచించి) ఎటులయిన నిప్పని సలుపక తప్పదు.

అ ను బ ం ధ ము 28.

చం॥ దురితవిచార తత్పరుఁడు దూషితుఁడంగజబాణతప్తుఁడై
పరసతిసంగమంబెదను పొందియటంచని నిచ్చయించె; మీ
దరయకలజ్జమానియకటా; ననుఁగుం బెనకత్తె కృత్యముం
గెరఁగనానతిచ్చె; నెటు నేర్తును పాతకమాచరింపఁగన్.

(ఆలోచించి) తప్పదు. తప్పదు. నా భర్తరాజ్యస్థైర్యమీ కీచకుని భుజబలంబుపై నాధారపడినది. వానియాజ్ఞకు మారుసేయఁజాలను. అట్టిదోష కృత్యం జేనొనరించినందుకు దైవమునను రక్షించుఁగాత. (ఆలోచించి) కలభాషిణీ! మధురలాలసా! (అనుచు నరచును.)

(ప్రవేశము - కలభాషిణి - మధురలాలస - ఉత్తర - మాలిని.)

కలభాషిణి:—(సుధేష్ణఁజూచి) అమ్మా! సుధేష్ణా! మమ్మేల బిలచితివి! నీ ముఖవికాసమ్ము తఱిగినదేల? ఏలచింతించెదవు?

సుధేష్ణ:—అమ్మా! కలభాషిణీ! నేఁడేమో నా దేహమెల్లనొక్కమై యగ్నిజ్వాలలలో నిలచినలాగు తపించుచున్నది. నాలుకయెండి యంగటికంటుచున్నది. జలమెన్నిమారులు ద్రావినను దప్పియాఱదు. ఏమిసేయుదు? నా సోదరునింట సౌరభాన్వితమైన సురయున్నదఁట. దానిని ద్రావినఁగాని నా దాహము తీరదు. (మాలినిదిక్కుఁజూచి) మాలినీ! నీవొక బంగరుగిన్నెను దీసికొని కీచకుని మందిరంబునకుఁజని వైళమ్మె సురనుదెమ్ము! త్వరలోఁబొమ్ము.

ఉత్తర:—అమ్మా! వణుకిడుచు నేఁబోయి తెత్తునా?

సుధేష్ణ:—(కినిసి) ఓసీ! బుద్ధిలేనిదానా! రాచబిడ్డవై యిట్టిపనులకు నీవు పోనగునా?



వలదు. (మాలినిఁజూచి) మాలినీ! తామసించెదవేల? నేఁబంపుమ్రమ నీకొండు గఁజాలవు కొంపోలు. వేగమ్మె వెడలుము.

మాలిని:— అమ్మా! సుధేష్ణా! పరపురుషుల మందిరంబునకు నేనెటుజనుదు?

కలభాషిణి:—మాలినీ! పోయినమాత్రమున నీనాసిముక్కు బోవునదేమి?

మధురలాలస:—పరపురుషుఁడు నిన్నేమిచేయఁగలఁడు. నీ మానసము నిష్కల్మషముగ నుండినచో నిన్నెవరేమియు సేయరు.

సుధేష్ణ:—సైరంధ్రీ! నేఁదప్పితోఁ జచ్చుచుండ నీవిటు తామసింతువుగదా?

మాలిని:—అమ్మా! నీకు పలువురు దాసీలున్నవారు. వారిలో నెవరినయినను బంపగూడదా?

సుధేష్ణ:—ఏమీ! దాసీ! నాకుబదులిడుచు నిలిచితివియా? పరులను పంపను. నీవేపో వలయును.

మాలిని:—అమ్మా! ఆ కీచకుఁడింతకుమున్న నన్నుచటఁగని కామవికారము తలకెక్కి యున్నన్నో యవాచ్యములగు మాటలాడెను.

సుధేష్ణ:—నా సోదరుఁడట్టివాఁడుకాడు. అందుచేఁ బనిపై నేఁబంపినపుడు నిన్నతఁడు నిలుపఁడు. వైళమ్మె సురయిచ్చి పంపును. పొమ్ము.

మాలిని:—అమ్మా! నాకేమో యనుమానమగుచున్నది.

సుధేష్ణ:— అ ను బ ం ధ ము 29.

మాలినీ! నీవు వెళ్లెదవా? వెళ్లవా? నాయాజ్ఞోల్లంఘన జేసితివేని నీవు నా మందిరంబు వదలి వెడలుము.

మాలిని:—(స్వగ) (ఇదినాగ్రహచారము) అమ్మా! సుధేష్ణా! మీయానతిమీఱ నాకు నలవియగునే? మీయిష్టానుసారంబు కీచకునిమందిరంబునకుఁజని సురను దెచ్చెద.

సుధేష్ణ:—అటులనే చేయుము. మేమందఱము మందిరంబునకు వెళ్లుదుము.

(సుధేష్ణ - ఉత్తర - కలభాషిణి - మధురలాలస)
(నిష్క్రమింతురు.)

మాలిని:—(స్వగతము) హా! హా! ఆ నీచాధముఁడు కీచకుఁడు నాతోనాడిన దుశ్రవ భాషణములకు నా మనము వ్యసనాగ్నింబడి తపించుచుండెను. పిడుగువడిన

హాసినిఁ గోరవింగాల్చినచందాన యీ సుదేష్ణ నన్నిట్టి యనుచిత వ్యాపారం బునకు నియోగించెనే? ఏమిసేయుదు? హరిస్మరణంబుగదా మహాపదలకుఁ బరిహరణంబు. శ్రీమన్నారాయణారాధనా పవిత్రనగుచు నాదురాత్ము మందిరంబు జేరెద. సర్వజనుల సుకర్మ దుష్కర్మలకు సాక్షీభూతుఁడుగనుండు కర్మసాక్షి నాకీకష్టసమయంబునఁ దోడ్పడి నా పాతివ్రత్యంబుఁ గాపాడుఁగాత.

సీ॥ ఆదిదేవా నిన్ను నర్థి సేవార్చింతు
భాస్వర నిన్ను భావమునఁ గల్తు
దినకర నీకు వందనములొనరింతు
ప్రభాకరా నిన్నుఁ బ్రణుతిఁ జేతు
సప్తాశ్వరథ నిన్ను సంస్తుతి యొనరింతు
లోహితా నిన్నుఁ గొల్తుఁ బాహియనుచు
లోకకర్తా నిన్నుఁ దేకువ భజియింతు
పాపహర్తా నీదు రూపమెంతు.

గీ॥ దేవ నీ లేని దినము దుర్దినమటంచు
భావమున నెన్ని ప్రణమిల్లి భక్తిఁ గొలుతు
దీనురాలను బ్రోవు మాదీనరక్ష
విశ్వమంగళ జగదీశ విబుధవంద్య.

కర్మసాక్షీ! నిను నమ్మి నేనా దురాత్ముని మందిరంబుఁ జొచ్చెద.

(నిష్క్రమము.)

చతుర్థరంగము.

కీచకుఁడు - సైరంధ్రి.

కీచకుఁడు.— అనుబంధము 80.

హా! హా! ఆ ముగుద వలని తగులు నా చిత్తంబు తల్లడిల్లఁజేసినది. ఈ నెవ్వగల కగపడి తలపోతలకుఁ జిక్కి కామునికోలంబులకుఁ జిక్కి దేహంబాక గడియయైన



రక్షించుకొను మార్గంబెద్ది? ఆ లలనాలలామ వాల్చూపులు వాలుగ తొంగలి ఱెప్పలఁ జెదరి వంపుటిరుతమ్ముల దిమ్ముసడలించి వలరాజుహాళిక తూపులై దూలఁ ద్రోలి ప్రోక్కించు మెఱుగుల నుక్కడించి నా మానసంబు నాచికొనిరయెను. నా భావంబు మోహాంధకారసంబున గడలుకొన్నియె. మదనవికారంబెంత యడఁచి కొనినను బయల్పడఁదొడరికొనియెను. అవ్వనితాశశి రూపంబు నా చిత్తము నందచ్చొత్తినరీతిగనంటి చిత్తజుని శరాళికిఁ దత్తరింపఁజేయుచున్నది. ఆమత్తేభ మకరవేణి సిగ్గు పెంపునకో నాచిత్తంబు తల్లడఁజేయుటకునోతిన యిల్లంబు తెల్లంబు సేయదయ్యె అయ్యో! ఆ తనుమధ్య తనతనువు నా తనువునంగవ్వించుకొనిన సాకద దివ్యామృతసేచనము గాకయుండునా? అత్తరుణి చిరునవ్వు నవ్వుచుఁ దనచెలువంపు ముద్దుపలుకొక్కటి పలికిన నా చెవులకది రసాయనము గాకయుండునా? ఆ కమలనయన ముక్కువనవంగి పెనఁగి సొంపు పెంపు లింపారన్నేన్ని కొనిన నా కపూర్వజన్మ సుకృత ఫలము గాకయుండునా? ఆ సైరంధ్రి యికనురాక తడసేనేల? ఆ తనుమధ్య వనటలుజూపి చింతిలి సుదేష్ణ దానిని నా సరసకుఁ బంపుటకు వెనుకఁద్రొక్కియుండునా? ఏమియుఁ దోపకయున్నది. మదనకదన దోధూయమానమానసుండనయి యీ రీతి యెంతకాలంబు కాలము ద్రోయుదును? విరహతాపంబు సైపఁజాల. సైరణ్మిపోయి యయ్యువతినట్టి తెచ్చి యనంగతంత్ర విద్యానిపుణత్వ మెన్నఁగ హృదయానందంబుగఁ బ్రముదాంబుధిలోనోలలాడెద. పోనిమ్ము. ఇది సరికాదు. ఇంతగఁ ద్వరపడిన నేసి కార్యంబు రిత్తపోవును. కార్యంబు రిత్తఁబోయిన నే బ్రదుకుట కష్టమగును. ఇది తగదు. వేచియుండెద.

సైరంధ్రి ప్రవేశము.

సైరంధ్రి:—కీచకా! నీయక్క సుదేష్ణ దప్పిగొని మద్యము తెమ్మని నన్ను నిటకుఁ బంపెను. దేవి తపించుచున్నది. వారుణి నొసఁగుము. చనవలయును.

కీచకుఁడు:—సుందరీమణీ! నీదేవి దప్పిగొనినదని జాలిఁబూని పలికితివి. అది న్యాయమేను. నేను మదనజ్వర తప్తుఁడనై బడలినాను. నీ యధరామృతరసంబు గ్రోలనిచ్చి నా తృషఁ దీర్చు న్యాయంబరయవేల? నళినాక్షీ! పలుకవు. పాడితలఁపవు. మౌనమూనితివేల? ఇఁక నీకీసిగ్గు తెరయోలమేల? సరసను రమ్ము. కౌఁగిలిమ్ము.

సైరంధ్రి:—కీచకా! అప్పుడిరాత్రి నారాకకెదురు చూచుచుండును. ఆలస్యమయ్యెనేని నాపైనలుగును. కావున శీఘ్రముగ మదిరబోయింపుము. పోయెద.

కీచకుఁడు:—నలినాననా! ఇతరులచే సుధేష్టకడకుమదిర నేఁబంపెద. ఆయమతాపంబు చల్లారును. నీవు నీసౌరభాన్విత మదిరంబు చవిఁజూడుము. నీవదన సరోజాంతరిత సుధారసంబు నన్ను చవిఁజూడనిమ్ము. నాతాపంబారును. వన రుహవదనా? నాదేవిగానుండి నాపాలి భాగ్యలక్ష్మిఁగమ్ము. అలసటయేల? సరసకురమ్ము. (అనుచు నంటఁబోవును.)

సైరంధ్రి:—గీ॥ తగదుతగదన్న దాసిపైఁదగులుతగునె?
వలదువలదన్న వన్నెయువాసి చెడును
హితముకాదన్న నీకిది సతినినన్ను
వదలిచనుమన్న నీకివే వందనములు.
(అన్నుచుచేతులు జోడించును.)

కీచకుఁడు:—గీ॥ మగువబిగువేల తగదిది మమతఁగనుమ
వగలసెగలను బొగలితి వనితనీదు
మొగముజూపుమ మదవార్థి ముంప రమ్ము
వెలదినీపాదముల నంటివేఁడికొనెద.

సుందరాంగీ! నినుఁగూడి సుఖమందినపిదప నాకేహానియైనను కానిమ్ము. నిన్నువదలఁజాల. వలయునన్న నీ పదములుబట్టికొని బాసచేసెద.

అ ను బ ం ధ ము. 81

సైరంధ్రి:— ఓరీ; నరాధమా! గర్వోన్నత్తుఁడవై కామాయత్త చిత్తుఁడవై కనులుగానక పరకాంతను పలువిధముల పంచాయుధుని కేళికిబలవంత పఱచుట పాప మూలంబని నేఁదెలిపిన హితములు నీకురుచింపవయ్యె. ఇఁకనే నిచటనుండ జనను. మదిర నీ వెవరి వెంటనైనఁబంపుము. నే పెవలెద. (అనుచు వెళ్లు చుండును.)

కీచకుఁడు:— (అడ్డముగనిలిచి) మగనిజవరాలా! నామందిరంబు సొచ్చితను. గంధర్వ



కేళినిగూడక వెడలిపోవుట సులభమా? గరుడునిచేఁ జిక్కినపన్నగము తప్పించుకొనిపోవసాధ్యమా? బిడాలముపకుదక్కిన బాలశారిక ప్రాణంబునఁబోవునా? వెడగా! ఇట్టిమాటలాడకు. మంచిమాటలచే నా మందిరంబుఁజేరి స్వామినివై సుఖమునమనుము.

సైరంధ్రి:— ఛీ. మూర్ఖా! నీమాటలు విననింపుగావు. నే వెడలెద. (పోవను ప్రయత్నింపఁ గీచకుఁడు చెఱఁగుపట్టును. సైరంధ్రి తానిడఁ గాలితోదన్న గీచకుఁడు క్రిందఁబడును. సైరంధ్రి వెళ్లిపోవును.)

కీచకుఁడు:— (లేచి) ఏమి. యీ స్త్రీ సాహసము. ఏమి యీ స్త్రీ సామర్థ్యము! అద్వితీయభుజసత్త్వుఁడను సింహబలుఁడనని ప్రపంచంబునఁ బ్రసిద్ధికెక్కిన నన్నీయబలతనపద తాడనమునఁ గ్రిందఁగెడిపెను. దీని పతులునిజముగా గంధర్వులుందురా? ఇది గంధర్వ స్త్రీ యుండునా? రావతెయయినఁ గానిమ్ము. దాని నే వదలఁజాల. అదిమందిరంబునకుఁ బరుగిడుచుండును. దానివెనుదవిలిపట్టితెచ్చెను.

(నిష్క్రమించును.)

పం చ మ రం గ ము.

వీధి.

కీచకుఁడు-సైరంధ్రి-సూర్యదూత.

కీచకుఁడు:— (సైరంధ్రిపోవుచుండ కీచకుండు వెంబడించి చెరుఁగుఁబట్టి.)

ఉ॥ చిక్కితివెందుపోఁగలవు సిగ్గరి; చేరుమునాదువీడు నీ
వెక్కడఁజేరినన్వదలనేలుమ నన్నుననంగకేళిలో
మక్కువమీర! నిన్గలసి మారునిమిక్కుటమైనయుక్కనేఁ
జెక్కడ నన్నుఁగాడనుచుఁ జేర్చెదవెందు? సరోజలోచనా?
సైరంధ్రి. నాబారిఁదప్పించుకొని జాఱఁజూచెదవో? నీవెందుపోఁగలవు? ఎవరునిన్ను రక్షింపగలరు? ఏదీ. నీ పతులు గంధర్వులన్నవారంటివే?

సైరంధ్రి:—(విరాటునింజూచి) మత్స్యమహీపాలా! మహారథులైన [illegible]రులేవురు ధర్మపాశా నిబద్ధబద్ధులై ప్రచ్ఛన్నవేషంబులుధరించి యేలోకంబునదాగినారో అట్టివారి ప్రియపత్ని నన్నా సూతసూనుఁడు కీచకాధముఁడు కాలితోఁ దన్నెనుగదా?

భూపాలా! నీవుధర్మాధర్మములరయవేని అబలనగు నేనుఁ జేయునదేమి? ప్రజాపాలన పరుఁడవగు నీయెదుట నీకంటియెదుట దురాత్ముఁడొకఁడు పరసతిని పరిభవించి బ్రతుకఁజూచుచున్నవాడే నే నేమని మొరలిడుదు? అయ్యో! ఈ నరపతి ఆస్థానములో నొక్కరుఁడైన ధర్మలోపభయంబుఁ జెంది యీ దుష్కర్మాసక్తుఁడైన కీచకుని అధిక్షేపించి పలుకఁడుగా?

కంకుభట్టు:—సైరంధ్రీ! నీ వెలుఁగెల్ల యీ జనపాలుఁడును నీ సభవారును నెఱిఁగిరి. పలుమాటలనుండి ఫలమేమి? నీవు సుధేష్ణ సదనమునకుఁ జనుము. నీ పతులు గంధర్వులు కోపంబునకిది తఱిఁగాదని యెంచిరిగాఁబోలు? కాదేని పరాభవమునకు సైచి వారూరకయుందురా? నాథులదూరుట పతివ్రతా ధర్మంబుగాదు. నిండుసభలోనిలచి శంకచెడి ధిక్కారపుమాటలు పలుకుచు నిలుచుంట సతికి హితముకాదు. కావున నీ విచటఁ దడయక నీ మందిరంబునకుఁ వెడలుము.

సైరంధ్రి:—(మానమూని తలయూఁచుచు నిలిచియుండును.)

కంకుభట్టు:—సైరంధ్రీ! కులసతులకుఁ హితమైన గౌరవంబు తొలంగి జావగాని అలుఁబోలె పలుబోకలఁ బోవుచు నర్తకిచాడ్పున విచ్చలవిడి నాట్యంబుద్రొక్కుచు సభలో నిలుచుట తగదు. వెడలిపొమ్ము.

సైరంధ్రి:—కంకుభట్టా.

కం॥ పతులేవురుందురందునఁ
గితవుండొకఁడయ్యె నృత్యగీతాదులనీ
డితమతి యొకఁడయ్యె నయో
మతిఁగఱపిరివారు! వేఱుమతి యేటలబ్బున్

కంకుభట్టా! మత్పతిశైలగాపుండ కావకతప్పదుసుం గావున జూదరియాలికి గరువతనంబెక్కడిది. ఇట్టిసభికులకు నా మొఱలెంత విన్నవించిన నేమిప్ర



యోజనము? నన్నా దురాత్ముని యింటికిఁ బంపిన సుధేష్ణ సరసకుఁజని నా వ్యసన సమాచారంబుఁ దెలిపెద. బోయెద.

(సైరంధ్రి నిష్క్రమము.)

విరాటుఁడు:- సీ॥ కీచకుడక్కటా నీచాత్ముఁడగుచు
సంకోచగావాత్సత నేచుజనుల
పరసతిగ్రహణంబు దురితంబుగా
నెన్నదురుతర పాపంబులరశి చేయు
పుణ్యాత్ములనుబట్టి భూరికష్టంబులు
పాసగ చేయునుబలు పొందుగాను
రాజ్యమెల్లనువాని రాకాములనువిని
వేసరిల్లినవాడ వేడుగాన

ఆ॥ వానిభుజబలమున నాదుప్రాసియెల్ల
నిలచినదిగాన వానినిబలుకఁజాల
కొదనుచుదోపదు నాకేమి కంకభట్ట
కష్టమాయెనుబ్రతుకుట దుష్టసరస

కంకుభట్టా! ఈ దురాత్ముని కీచకుని దురాగతంబులు వినివిని వీనులలసినవి. వానివిషయంబున నే నేమియు చేయఁజాల. వాని యాజ్ఞాబద్ధుఁడను నేను. వానినుండి నారాజ్యము స్థిరముగానిలిచెను. కావున వాఁడే దుష్కృత్యంబులొనర్చినను నే సహించియున్నవాఁడను. నా యత్నము మీరినది. కాఁజేయునని గంధర్వులు చేయుదురు. నేనేల చింతింపవలెను: పోవుదము రమ్ము.

(నిష్క్రమము.)



# విరాటపర్వము.

# కీచకవధ.

తురీయాంకము - ప్రథమరంగము.

వలలుని వంటశాల.

వలలుఁడు - సైరంధ్రి.

సైరంధ్రి:---( మెల్లన నడుగులిడుచు నలుదిక్కులు జూచుచు వచ్చి నిద్రఁబోవుచున్న వలలునిఁజూచి యేకాంతమునకువచ్చి ) ఈ మహాపురుషుఁడు తనమానినీపరిభవమును గన్నులారఁగనియును సంతుష్టిగ భుజించి యొడలెఱుంగక పడి నిదురించుచున్నవాఁడు? ఏమిసేయుదు. ధ్వనిసేసి లేపఁబూనినచో నిరుగు పొరుగువారు నిద్ర లేతురు. దానివలన నాకార్యము చెడును. గావున నే నతనిని సమీపించి మెల్లఁగ నిదురలేపెద.

( అనుచు సమీపించి తనకేలు వలలునిపైనవైచి నిద్రలేపెను. )

వలలుఁడు:---( నిద్రలేచి కన్నులు నులికొనుచు నలుదిక్కులఁగని సైరంధ్రినింజూచి) ప్రేయసీ! ఈ సమయమున నీవిచటికిరాఁ బనియేమి కలిగెను?

సైరంధ్రి:---ప్రాణనాథా! నీయడుగు ప్రశ్న నామనమున కిఱుతెగల యచ్చెరువు కలిగించుచున్నయది.

వలలుఁడు:---ప్రాణేశ్వరీ! అదియెట్లు?

సైరంధ్రి:---నాథా! నన్నిచటికేల వచ్చితివని యడిగిన కారణం బొకటి నీకు నిద్రవట్టెనే యను కారణంబు వేఱొకటి.

వలలుఁడు:- --నాతీ! ఇందునచ్చెరువునందు సంగతి యేమున్నది?



సైరంధ్రి:— అష్టబంధము 33.

నాథా! నీ ప్రియపత్ని పరిభవంబు కనులారఁగాంచిన నీ కెట్లు నిదుర వచ్చెను? ప్రాణేశ్వరా! శౌర్యసాహసంబులు వదలి మృతునివలె నిద్రించిన నీ యుత్సాహంబు నిలుచునా? నీ ప్రియపత్నినగు నన్నా దురాత్మునిఁ గాంచి భ్రమించెనుగదా? ఇది నీ యపయశస్సునకుఁ గారణంబు గాదే? అలనాఁడా ద్యూతావసరమున దుశ్శాసనుఁడు నా కొప్పుఁబట్టి యీడ్చెనుగదా! అది నామానసంబు దహించుచున్నయది. ప్రాణనాథా! సార్వభౌముఁడగు నేనుబుట్టి యితర రాజపుత్రి యొకతె నాయంతటి యిడుమలం బడి బ్రదికినదా? అలనాఁడా వనవాసంబు సేయునప్పుడు దురాత్ముఁడగు సైంధవుఁడు నన్నుఁబట్టి రథముపై కొనిపోయెను కదా? ఆ సంగతులు తలఁచి నను జల్లారకయున్నది. అయ్యో. భీమా! నేనేమని తెల్పుదును? ఆ పాపాత్ముఁడు కీచకుఁడు నన్నుఁ జూచినప్పుడంతయుఁ దన భార్యగనుమని నన్ను బలాత్కరించుచుండును కాదనిన నన్నుఁ గాలితోఁ దన్నెను. అకటకటా! నా ప్రాప్తి యింతకు వచ్చెను ప్రాణనాథా! ప్రతాపవంతులగు పతులేవ్వరు ప్రపంచంబున బ్రతికియుండఁగ నే నాకింతటి దుఃఖంబు ప్రాప్తించె. పూర్వజన్మంబున నే నెన్ని పాపంబు లొనర్చియుంటినో యవి యన్నియు నొక్కమై యీ సమయంబున నన్నుఁ బాధించుచున్నయవి. నాథా! నా చేతులంటి చూడుము. యెన్ని కాయలు కాచినవో? ఆ సుధేష్ణకుఁగాను నలుగు నూరి చందనమును దీసి నా చేతులు కాయలు కాచినవి.

వలలుఁడు.—నాతీ! నా సరసఁజేరి నీ వేల యీవిధమున బరితపించుచున్నావు? నే నొక్కఁడేనా నీ భర్త. మిగతవారెవరును లేదా?

సైరంధ్రి:—నాథా! నా మానను రక్షించువారెవరును లేరు. ధర్మజుఁడు బ్రాహ్మణుండై శాంతిగుణము వహించి ధన్యుఁడయ్యెను. అర్జునుఁడు అంగనయై యాడుచున్నాఁడు. నకులసహదేవులు పనులగాపరులై పరితపించుచున్నవారు నే నేమిసేయుదు? నినుదప్ప నా మొర మరియొవరికి తెల్పుదును?

వలలుఁడు:— నాతీ. నన్నీరీతి పలుకుధముల ప్రేరేపకు. వంటలవాఁడనై పరితపించు నే నేమిసేయఁగలను.

సైరంధ్రి:— సీ॥ పూడిపోయె నెసీదు భుజసత్త్వసారంబు
బకవైరి! వంటలసనులయందు
పాడుపోయె నెసీదు పటుపరాక్రమమెల్ల
వనవాసఖిన్నతంబవనతనయ
వీడిపోయె నెసీదు విక్రమక్రమమెల్ల
కిమ్మీరహంతకా భిక్షువడితె
వాడిపోయె నెసీదు వన్నెవాసియునెల్ల
నెటుజటాసురుబట్టియే చిలీవు

గీ॥ కీడుపడిపోయెనే నీదు కీర్తి రమణ
కాడుపడిపోయెనే శౌర్యకాంతిభీమ
ఎటులనీ కాంత పరిభవమెల్లఁజూచి
నిద్రపట్టెనునీకింత భద్రముగను.

అనుబంధము 34.

భీమా! యిట్టికాలంబున నీవు ననురక్షింపవేని నేమనియ్యుండఁజాల.

వలలుండు:— ప్రాణప్రియా! నీమాటలు నాదుఃఖాగ్నికి నింధనములైనవి. అయ్యో! చిగురుటాకులంబోలు నీకేలు కాయలుగాచినది చూచియున్నట్టి దుస్థితినుండి నిన్నుఁదప్పింపని యీ భీముని భుజబలము వ్యర్థము. ప్రాణేశ్వరీ! ఆ దుర్గర్వి, ఆ దురాత్ముఁడు కీచకుఁడు నీకొనరించిన దురాఘాతంబు సైఁపక యప్పుడే వానింబట్టి నేలఁబడవైచి చావచంపవలెనని లేచితి. ధర్మరాజు నన్నుఁజూచి కనుసన్నచే నివారించెను. యత్నములేక నిలచితి. అయ్యో! నేనటు సైఁపక విజృంభించి యుండినచో సమయభంగంబు కలుగుచుండెను తత్కారణంబున దుర్యోధన దుశ్శాసనాది దుష్టచతుష్టయంబులకు దుర్మరణంబు గల్పించి పదుమూడువత్సరంబులుగ హృదయంబున నాటిన బాణము దీసివైచుట నిలిచిపోవుచుండెను. భామినీ! ఇవియులొకటి వెంబడి నొకటి యొకటివచ్చినను శత్రుంబు వదలకుము. కోపంబు వశమించుకొనుము.



సైరంధ్రి:— నాథా! నైషసంతతి దుఃఖంబు సైఁపనోపుమనుగాని మిలిమీటికల్లోలములభంగి నిరంతరముగ నొకటిపైనొకటివచ్చు మహాత్తరవ్యసనంబు నే నెటు సైరింపనేర్తును?

వలలుండు:— పురంధ్రీ శిరోమణీ! పరమపతివ్రతవగు నీకు నే హితము నుపదేశింపవలెనా? శమదమాద్యనుష్ఠానపరుఁడైనట్టి రూపంబుఁదాల్చిన భార్గవచ్యవనుని సేవముఖమున సుకన్య సుఖములు పడయదా? జనకరాజసుత వనవాస సంకటములంబడి రాక్షసబాధితయయి తుదకుఁ దనపతిఁగూడి సర్వసౌఖ్యములనందదా? ప్రాణప్రియా! లోపాముద్ర తనపతితోఁగూడను పడిన యిక్కట్లు నీవెరుఁగవా? అనింద్యతయగు సావిత్రి తన పాతివ్రత్య సామర్థ్యంబున యమలోకంబునకుఁబోయి తనమగని సత్యవంతునకుఁ బ్రాణంబులు వరంబుగఁగొని క్షేమంబుననుండదా? అటులనే నీవును మానసంబునఁ బతిభక్తి మఱవక కష్టములకోర్చికొనియుండుము. అజ్ఞాతవత్సరంబు సమయవచ్చినది. ఇఁకనొక పక్షమున్నది. విపరీతంబుల కంటఁబడనీయరాని వగుదువు.

సైరంధ్రి:— ప్రాణనాథా! నేనింతగ మొఱయిడినది నా సంకటమునకొక్కటియ కాదు. పరులసంకటములఁజూచి యోర్వఁజాల. ఆ దుష్టాత్ముఁడు కీచకుఁడు పరివారిలోనన్ను పరిహాసంబుఁజేసి కామకేళికి నన్నుఁ బిలుచుచున్నవాఁడు. కుపితనై నే ధిక్కరించినపుడంతయు నన్నుఁ గాలఁదన్నుచుండును. ఓరీ! మూఢా గంధర్వపంచకంబునకు నేను ప్రియమహిషిని. ధైర్యసాహసవంతులైన వారలిగిరేని నిను యమపురంబునకుఁబంపుదురని భీతిగొలుప గంధర్వులేవురు గారు, గంధర్వ శతసహస్రులువచ్చి నను వారినిఁ జంపెదనని ప్రల్లదంబులు బలుకుచుండును. నాథా! వాఁడు ధర్మత్యక్తుఁడు. పరస్త్రీ రక్తుఁడు. పరస్త్రీ పరవిత్తాపహారి. కామ పరతంత్రుఁడు. కావున నాథా! వాఁడు బ్రతికి యుండిన ధర్మలోపంబు సంభవించునొకటి. మీకుభార్య దక్కదనునది మఱియొకటి. ప్రాణేశ్వరా! భార్యను రక్షించినగదా సంతతి రక్షితమగు, సంతతిరక్షించినగదా తానురక్షితుఁడగు. భీమసేనా! వాఁడు బ్రతికియుండిన

గ్రీడసమరంబుల సకలరాజులను జయించి భుజముల నేలు వాడను నేను. విరాటుఁడు రాజనునది నామమాత్రమేను. పదివేవుర మదపతుల నేపడకి పట్టినఁ నాకడ్డంబువచ్చువాఁడిమగండు యీ పుడమిలేడు. కంటివిగదా? నిన్నటిదినంబున కీచకుని సుంగిట నిన్నుఁబట్టినప్పుడు పోటుమానసి యొక డైన నిన్ను విడిపించెనే. ఉపేక్షచే నేనే వదలితిని. గంధర్వులెవ్వరు నీపతులుగలవారని పౌరుషములు బలికితివే? అందున నొక్కఁడైన నిన్ను విడిపింపజూచెనే? నీకేల యీ జెలితనము? రారమ్ము. ( అనుచు పట్టుటకుఁ బోవును. )

సైరంధ్రి:—కీచకా! త్వరపడకుము. మనోజతాపులకు నీచిత్తమర్పించిన వాఁడవుగావున కర్తవ్యకార్యంబు నీకుం దెలియదు. వలదనియెంత జెప్పినను ఆలకులవలె కానికి లోనై పైఁబడవచ్చెదవు. నీవుమగవాఁడవుగాన నీతగులము దెలివేసికొంటివి. మగువలట్టివారుగారు. ఎంతటితగులంబులఁ బోగలిగినను దానిని వెలివేయుకవునంబునం దాచికొనియుందురు. ఈరహస్యంబు నీవెఱింగినహస్యంబు వెలిపడనట్టి మార్గంబు వెదికి నీమదిగోరిన నీదివ్యభవ్య భోగంబను భవింపుము.

కీచకుఁడు:—లతాంగీ! లతాయుధుఁడు నా ధృతినంతయు నీఱుగావించెగావున నాకుఁ గర్తవ్యాకర్తవ్యంబులఁ దెలియవు. నీ యాజ్ఞకుఁ లోబడెడువాఁడను. ఎటులొనరించిన నిజాభిమతంబొనగూడునో దానిదారి దెలుపుము. అనురాగయుక్త చిత్తవై మనసిజ రాజరాజ్యలక్ష్మిని నా చేగూర్పుము.

సైరంధ్రి:—కీచకా! మనయుత్తర మొదలగు మత్తకాశినులు నృత్తము నేర్చు నర్తనశాలకు యీనడిరేయి నీవువచ్చితివేని అందు నీ చిత్తవృత్తికి దగినభంగి శాశ్వతసుఖంబందఁగను. అంతవరకు తత్తరపడకుము మత్తిల్లి నిద్రాపరవశుఁడవై కార్యంబేమరకు. ఈ రహస్యంబు వెలిబడనీకు.

కీచకుఁడు:—నలినాననా! నన్నానందసాగరంబున ముంచితివి. విరహాతప్తుఁడనైన నాకు నిమురవచ్చునా?

సైరంధ్రి:—కీచకా! అట్టి సమయంబున నీవొక్కఁడవు దక్క వేర వలయదుసుమా. మఱి యెవరును నీవెంటవచ్చిన నేనచట నిలుచుదాననుగాను. నిజమిది కీచకా! ఇది



జనసంచారభవనము. అనుమానము లేక మనమిటు మాటలాడుచుండఁ నెవ్వరేనైన వినిరేని అవమానంబగు. కావున శీఘ్రంబ నీవు వెళ్లుము.

కీచకుఁడు:—భామా! పోయివచ్చెద.

సైరంధ్రి:—పోయిరమ్ము.

కీచకుఁడు:—సుందరీ! సమయము మరవకు.

సైరంధ్రి:—నేనెంతమాత్రము మరవను. వెళ్లుము.

( కీచకుఁడు నిష్క్రమించును. )

సైరంధ్రి:—(స్వగతము) నేఁడర్ధరాత్రికి వీనికి ఆయుఃకాలప్రమాణంబు తీరునని వీని నొసట విధాత వ్రాసినాఁడు. నేఁటితో యీ కంటకునితో పరస్త్రీలకుగలుగు బాధలెల్ల దీరును. నేనిప్పుడేపోయి భీమునకీవార్తఁ దెలిపెద.

( నిష్క్రమించును. )

## తృతీయ రంగము.

### నర్తనశాల - చీకటిగానుండును.

భీముఁడొక మంచముపై బరుండియుండును. ద్రౌపది యొకమూల నిలచియుండును.

కీచకుఁడు:—( ప్రవేశించి మంచముచెంతకుఁబోయి ) మానినీమణీ! మన్మనోహారిణీ! మనోహరంబగు మధువుఁదెచ్చినాఁడను. మానసానందంబుగ సేవింపుము. కామినీ! మరుసాయకములనోర్చితి. నారీమణీ! నాసురూపంబుఁజూచిన నారీమణి మఱియొరునైన కోరునా? నరకు సేయునా! నా లావణ్యంబుఁజూచి యుచ్చమెచ్చని మెచ్చులాడి ప్రపంచంబునంగలదా? నా విలాసంబు భావంబున దలచినపడతి మారభల్లంబుల నోర్వక ప్రపంచంబున నిలుచుటెటుల! ఆలస్యంబేలనెమ్మి. మదనకేళికిరమ్ము.

వలలుఁడు:—కీచకా! అట్టివాఁడవు నీవు కావుననే నిన్ను నీవు పొగడుకొందువు. ననుఁబోలు ఆమదాని యీ పుడమిని యెచ్చటనైన గంటివేమో తెలుపు. నన్నితర స్త్రీలతో బోల్పక నీశరీరము నా శరీరముతో జేర్చి నప్పుడే నీకు శాశ్వతముగు స్వర్గానందంబు గలుగును. కీచకా! దూరమ్మున నిలచితివేల? నసమకు రమ్ము. కేళిందిమ్ము.

ఉ॥ చింతలయింతిసేకుసు నవీనసుఖంబులు గూర్పనెంచి యే
కాంతమునందు నిల్చినది కానవె కీచకముందు నెన్నఁడే
కాంతముని పుకస్తుఁ గవఁగాంచఁగ నెంతువెనన్ను గూడినన్
చెంతకురమ్ము మన్మథుని చింతను దీర్చెదచిత్రకేళిలోన్

కీచకుఁడు:— సైరంధ్రీ! మనమిరీతి యన్యోన్య స్తోత్రపాఠకులగుచు బ్రొద్దుపుచ్చనేల? శయ్యాసుఖంబనుభవించు కాలంబిది. రమ్ము. (అనుచు మంచరికింబోయి వలలునిపై కేలిడి) (స్వగతము) ఏమీ! నేనుదీనినంటినపుడు దీనిదేహముకుసుమకోమలతనొప్పుచుండెను. ఇపుడెంత కఠినత వహించినది. నేనుదానియొద్దపై చేయుడితి కాఁబోలు. దీనిపయ్యెద పాషాణముకంటెను కఠినము కాఁబోలు. (అనుచు మరల సమీపించి ముసుగుదీయును. వలలుఁడు లేచును.)

కీచకః:— ఓరీ! నారీవేషంబుబూని మోసగింపవచ్చితివియా! నీవొక శూరుండవా.

భీముఁడు:— ఓరీ! నీచా! పరభామల కామించువాఁడు భామకంటెనుతక్కువగదా? ఇపుడే నిన్ను జీల్చి భూభారంబు తగ్గించెద. (అనుచు కీచకునిబట్టును.) (కీచకుని క్రిందఁగెడపి పైనకూర్చుండి) ఓరీ. కామాంధా. పరకామినిని కామించిన కలుషంబునీ కంఠంబునకు కాలపాశమాయను. చూచితివియా? ఇదిగో నీకాలు సేతులు విరిచిచిత్రవధగావించెద. (అనుచుఁవానిఁజంపును) సైరంధ్రీ! నిన్నేచినపాపాత్మునకు కలిగినచిత్రవధగన్నులార జూచితివిగదా? మెల్లనబోయి సుఖముననిద్రింపుము. నేనునుపరులెరుగ నటులపోయెద. పరకామినుల బాధించు పాపికి గలుగుప్రాయశ్చిత్తంబిదియని ప్రపంచ జనులెల్లరు తెలియుదురుగాత. మనమిచట నిలువంజనదు. పోవుదమురమ్ము.

అనుబంధము 36.

మంగళము.



# Appendix—అనుబంధము

అనుబంధము 1.

మాండురాగము - ఆదితాళము.

సూత్ర:— శ్రీదేవా మహాదేవా భావమ్మున నిను సదా సంస్మరింతుమా ॥ ప ॥
ఘనుని నిన్ను మనమునందు దినదినము నే మదిన్
నయభయములఁ విసగులఁ జేతున్ గనుసను కరుణన్ ॥ శ్రీ ॥ ౧ ॥
కాలకాలముల నిన్నున్ కలుష హారా కృపఁబ్రోవన్
వేఁడెదను నిరతము ననుకరుణన్
దురితహరా ధరణిధరా భావమ్మున నిను సదా సంస్మరింతుమా ॥ శ్రీ ॥ ౨ ॥

అనుబంధము 2.

హిందూస్తానితోడిరాగము - ఆదితాళము.

ధర్మరాజు:— తాపాము సైపాను యీపానిదేహము కాపాడలేనర శ్రీపతి ॥ పల్లవి ॥
కానన్ బదుమున్ కానాను పథమున్ మనలేము మహినింక మానాను
మతులపుల తల్లిమమాయే సుఖ ముపాపోను దేహముతాఁకి కేలుంబవలన్
సైనుల బాధల్ ఘోరాములయ్యెను యీ సైపకనుమ
మానాముఖిడి సుమలన్ గాడి

అనుబంధము 3.

కల్యాణిరాగము - త్రిశగతితాళము.

అర్జునుడు:— రారదురమున నిలువుము వేగా ధీరవృత్తిని నిలుపర దురమునలరఁగ
కిరాతక:— పోరపలుకకు యిటువలెనీవు శూరధర్మము సలుపుచు నిలువరా దురమునన్
అర్జునుడు:— యిదెచూడు పదునగుశరము గదియునునిన్నూ పదిలముగాను నిలువుము నీవుమాట లేలిక దిటముగ యిపుడు నిలుకుటెలుగు.
కిరాతక:— పలువాలా బలెనికవలదూ పలుకగనీకూ ఫలముగు నేమ ఫలమునుమాను
శ్రాలునీశరములువ్యయపరు పదునెరపకు.

## మోహన రాగము.

ఊర్వశి:— కాలమునను-కలపక-అలదుల-పొన్నసనుదతి-సఖుప్రమ హితమతి
సరసముగను-పదలనిను-చెదరని-మదపతికిని-ముదముదవగ-గనిమ్మను ॥౧॥

అర్జున:— పాతకపథము పదలికితగునటె పాదములబడీ అడగెపవడెజను
కమహితమగు నపతగనువినర్ధుముకు ఓపవక ఘదచెత గెడఫక గనిమను ॥౨॥

## బిలహరి రాగము.

ఊర్వశి:——మదనుడువిను నే మన్మథులపలుకుల తలపర మదిచెదరరకసరా
అలసితీ సొలసితీ నిలుచుగతీ నిలువగలనె ఆంసతపూసవలదూ ॥౩॥

అర్జున:— పలుకసు కలికికలుషపునడతలు తలపకు వడి వెడలుము యికసూ
వినుసతీ-హితమతీ నిజముసతీ గలిగాదెలిసి ఘనుమికనీవు చెలియా ॥౩॥

## శ్రీ రాగము

ఊర్వశి:— భాగ్యవపురికపక్షు ములుకగు మిగులికినిత్యాలేక తహ తహ బహుమనుయిటిల
చెదరమది-జెదరవచ్చి పదములబడియుమగా స్థనయనీవు సరసకుపిలిచినను
వలచిదేళి గలిచిబాళి నిల్పకహితంబులని మతంబులను దెలుపుదును
వలలు వెయిదిహితమె యుపమలను ॥౪॥

అర్జున:--- వాసవదసా మదినిపలుకకనీ పటునమూరుకెళి అడుగగతను
సటచెలియ కలుషమిది వలదుపొమ్ము పలుకకు యికకలికీ
హితముకాదు నృత్యముకాదు వదలుము పతివ్రతడు
హితామగునె పరపురుష గమనమూ మదిగనుము క్షితిహితమూ ॥౪॥

## అనుబంధము 10.

### కమాజు రాగము - ఆదితాళము

ఊర్వశి:— మారుకేళికి సరసుడరారా ॥మా॥
పూలశయ్యపై రయెలు మేలురతి చాలు మేలుగనువె ॥మా॥
కౌగిటజేరుచు కలయుచుమీరు కాముని క్రొవ్వు కడతేర్చరారావడి ॥ కేళికి ॥
పుష్పాలుగంధము పాలుఫలపూని పొందుదునిన్ను పొలుపార రారావడి ॥ కేళికి ॥



## అనుబంధము 11.

### కానడ రాగము - రూపకతాళము.

ఇంద్రుడు:——ఏమీయిటూ నాదుతనయ ॥ పల్లవి ॥
ఏలయిటూ వెతనందుచు వెలమోమువంచెదు ॥అను॥ భూరివిజయు వీరుడవై
భూరిభుజ శూరుడవై వారిభవనయసమిత్రి కారణమరయ ॥ ౧ ॥
గోరితి మదిదెల్పుమ యూతారకిటు వెసనాముసా జేరియుటు ॥ తాపాము ॥
తీరగనే జేసెదా.

## అనుబంధము 12

### బిలహరి రాగము-రూపకతాళము

ద్రౌపది:—— ధాత్రవ్రాతా-దాటసాధ్యమే
వలపుకుందగవచ్చునే-లాభము వాసి మీరగ-దాసీనయ్యేను.
విరటునింటను వైభవహీనత, వింతాయితగ-వేసాయూనెద
కొలువుసందుచు-గోడులునందుచు మాలినీయనికాలామేప్పడ

## అనుబంధము 13

### కమాజు రాగము - రూపకతాళము

ధర్మరాజు:—— వందానమాచారింతూ- మీపదామూల ॥వం॥
వందితనూనీంద్ర వారీమిరఆశీ
ర్వాదామూనిడిమమ్మూ, వనటాలబాయగసలుప ॥వం॥
అజ్ఞాతవాసాము, అరవత్సరము
యుండూరీతిని, మాకు, నరయకీజేనలిడుమా ॥వ॥

## అనుబంధము 14

### కరహరప్రియ రాగము-ఆదితాళము

ధౌమ్యుడు:—— దేవ, దేవ దేవా దీనాధిభావా
పాలితాభవా- ఓమాధవా ॥దేవదేవ॥

వారిజాసనా-దనుజభంజనా
వాసుదేవపద-దాసులానుబ్రోవు.

## అనుబంధము 15

### కానడరాగము - చాప్‌తాళము

ధర్మ:— భారామాయె భువినీ మనాజాలా
మనజాలా చింతాబ్ధి మునిగితే లూనూ ॥భా॥
అనుజాల నోడితీ అతివాను ఓడితి
అకటా గతిగాన అయ్యొసైపనూ నే ॥ భా ॥
వీడును పోయెను విడిముడి పోయెను
చెడితీ సన్నిటజేటులుమూడె.
(26-వ పుటలో ధర్మరాజు శమీవృక్షసరసమోసికొనిరండు అనిన దేనకులసహదేవులు యీపాటపాడుదురు.)

## అనుబంధము

### జంఝూటిరాగము- - ఏకతాళము

నకులసహదేవులు:— ఏదినీఅనాతిసలుపువాడనూ వినయమునను
నమునునినుఘనముగ అనుదినమునాను॥ దలచి
మనుసునూ॥ హృదయమునను పదిలము
గను, నినుగని, అనుదినమునీదు, పదముదలచుచూ.

## అనుబంధము 16.

### సావేరిరాగము - రూపకతాళము,

దుర్యోధన:—మానసామ కుంటెవనట కానముదమును ఆహా
పెరులసిరులు వదలిమైన సురలవిభవముండి
రకట। నరుడుభూరివీరుడాయెను హరునినోరిచి॥
వరములంది కరముమెరసె శూరవారమూను
తమమోనేత నేను నోచగాంచి। ధరణినిలువనగునె నేను॥



## అనుబంధము 16 2.

### హిందూస్థాని కేదారరాగము - ఎకతాళము.

ఇదేమకటా వినోదము - మనబాధలు పాండవులకు శుభమే
మనఃగజాలనే నదినేగాంచి ॥ ఇదే ॥ పల్ల ॥
కాననవాసంబులని వశించినగాన రైరిగద బాధలుతో పాదేష్ఠి ॥ఇదే॥

## అనుబంధము 17.

### కాపిరాగము - ఆదితాళము.

కర్ణ:—వెతవలాదుచాలునికలే
హితమే ఇదినమ్మతమే మతమే ॥ వె ॥
వైరిగజహరియయినిరతమునీనుగను
శూరుడనునను గనునమ్మమా
హితమేయిదినమ్మతమేమమతమే
కానివారిగాంచూచుకావుడామజక్కడు ధీరుదవునీవు ॥ ౧ ॥

## అనుబంధము 18.

### కాఫిరాగము - అటతాళము.

కర్ణుడు:—అరె అరె శూరాధము - మాశాడకు - నోరెత్తకు ॥ ప ॥
అశ్వ:—పోరుండరు - ధీరూబలె - పోరాటలు , కోరాకిక ॥అ॥ ప ॥
కర్ణుడు:—తిండీతిని : కండాకసి - మెండూగని - యుండాకిటు
అశ్వ:—భండానపు మాటాలను - దుండీగీడ - ఆడానేల
కర్ణుడు:—సుద్దూలిక - వద్దూచను - తద్దీనపు -తిండీతిని
అశ్వ:—పెద్దారిక - మేలాయిటు - మొద్దాగను - మానామును ॥

## అనుబంధము 19.

### మధ్యమావతిరాగము - రూపకతాళము.

అశ్వ:—వలదుకర్ణ వాదులుయిక పోలాయిది తమలోమానుము.

## అనుబంధము 24.

### కాపిరాగము- రూపకతాళము

మాలిని:— ఏమని-నేనుదూరుదునూ-హా-హా-నాదుకర్మఫలామాహా ॥పల్లవి॥
మదినిఁగుందవేలోకో వీ ధాత్రవ్రాతను నేడు
రాజ్యవైభవంబు వీడుచు-పూజ్యతనువీటి-పుచ్చుచు
రోజుచుండు-సమయమందున-యోజనలోపడ నేలోకో
నాసినీడి-వన్నె కాయుచు-దాసినయితాలికుందును
వేసరల్లుతరిని-మున్నటి ఆశలలోపడ నేలోకో.

## అనుబంధము 25.

### శంకరాభరణరాగము - ఏకతాళము

కీచక:— మోహనాంగిరో నీపదదాసుఁడనే నీవాడనే-మన మోహనా
మారుమితారి నామదనాకతారికావా- నేరమి కాచాల్
తాళజాల-సుందరీ-నీకారి-నేగోరీ-ఏహారిలినే ॥ప॥

## అనుబంధము 26.

### రాగము - తాళము

కీచక:— రమ్యందూకుజాచీతి నే-సుందరాంగిని నే ॥ప॥
మదనునిభాదకునోర్వగ జాలనూ-మదినెంతో-సంతాపంబాయెనూ అకట
మదగజయానసూ-ముదముగ రేలెడు .
శమమే మోదో పాదుయుంతాని యోచింతు.

## అనుబంధము 27.

### అఠాణరాగము-ఆటతాళము

సుధేష్ణ:— కులసతిని కూడదిటు వలదన్నా కలుషమిదీ వలదు వలదు ॥వ॥
మదనబాణహతి జిక్కికడుస్రుక్కి మదికలచుట మతముగునైటు
మనమున మమతనువిను ॥౧॥



పాడిగాదు అన్నతీరు పరుషములిటువలె పలుకకు ॥అ॥
మదవతిరో మదనునకు మదిబెదరి మదముడిగి మరులకు
గురినై బెదరకు ॥౩॥

## అనుబంధము 28.

### హిందూస్థానిఝంఝూటిరాగము - రూపకతాళము

కీచక:— హితమేనాకు-హా-యేమిసేయూబోపదు
పరసతితలచి పాపియైలాగు-దురితము
నాకు-చేలాగన-జేసె ఆహా
గతిగన-యేటులా- తాలిగన నేఁనతినెటు వానీ
రతికెటుపంపుదానా ॥హి॥

## అనుబంధము 29.

### బేహాగ్ రాగము - ఆదితాళము

కీచక:— పోవేపేగాదాసీ-ఆలాసత-చేయనోపాను
సారమధుర-తేరపోవే-విలువాగలానే-ఆలాసత
మాటపలాదు-చేటురాదు-తెరవాఁపదావె అలాసతా ॥పో॥
మాలిని-పోభ్రమా-వేగామే-ఇటుతామాసించేద వేలానే
మానీని పొమ్మా-సుడవపితెమ్మా ॥పో॥

## అనుబంధము 30.

### సురటిరాగము - రూపకతాళము

కీ:— మానిని-రాకను నే- గాచియున్నవాఁడనహా
మరుశరములు తాళజాల-తరుణిరాకనిల్చె నేల ॥మా॥
చెలువ-రూపమునుజూచి-నిలువలేనుమహిని ॥మా॥
కులుకులాడి-కూడుకొంటుల-బాలి-తాళ-జాలనేను ॥మా॥

అనుబంధము 31.

శ్రీరాగము - రూపకతాళము

కీచకుడు:— సుందరీమణీ-కాముబారితాళగ-గలనేసిక నేతాళ్లేల,జాలమేలా
మదనశరములనూ-మనామదేగాంచుమమంటలరయే
మనోహారిణి-తరమేయిక-నిలువజాలనూ-తరుణీ
కరుణాదాల్చినన్ను గావునతులునిసెద ||సుం||

అనుబంధము 32.

బిలహరిరాగము - ఆదితాళము

కీచకుడు:— వారిజనయనరో-దారవుగా-చేకూమ-సుఖములు నరయగా
మారునిశరముల్క్రూరాతమనుజక్కి- తాళ్లితినను జూడుసారస
గంధిరో

జాలామువలదిక-లోలాక్షిరోలీక
గలయములాలనజేలుజేలాగపలుకకు మేలాతనము
విడు-బాళీనితాళానుకాలాముపోవునూ.

సైరంధ్రి:— నీచాత్మ-ననూవిడు నింద్యాముగారయేచాకు ననుయింత రయేగేదిని
హితా!

యోచానసలుపర - దాచక తెలిపితి - తాళీమీబూనుమూ||
క్రూరాత్మపలుకకు క్రొవ్వినమది - మారూనిశరముల
మందితరీ వారిజనయనల తారీమసలుట
శూరూలధర్మమే దూరముపోవర ||నీ||

అనుబంధము 33.

సురటి రాగము - రూపకతాళము

సైరంధ్రి:— భీమారికాలాంతక - పిరికిపైపలుకాగా
నేమామను నేలాజాలి - బాధలనుబాపు



లేతమ్ముపేగవ్వె - ఖలునిజంపగబూను
కాలామయ్యేనేడు కనివానివధియింపు||

అనుబంధము 34

భైరవిరాగము - ఆదితాళము

సైరంధ్రి:— ప్రాణనాథలెమ్ము పాపిజంపగాను
మేనుబాయుదు - కానివాడుభీమ
రేపురేయివాని బావకుంటివేని
ప్రావులేదని రయుప్రాణమేను||

అనుబంధము 35

బిలహరిరాగము - ఆదితాళము

సైరంధ్రి:— సంతసముమీరగనే - నాథునినా - కౌగిటిలో
శూరిధైర్యసారపెల్ల - పీల్చితినాశక్తిచే||

అనుబంధము 36.

ఇంగ్లీషునోటు రాగము - తిశ్రగతి తాళము

శ్రీవరా మురా సురా హరా కరుణా భరణా
నిజభక్త భరణ చారుతరుణ శోకహరణ || శ్రీ ||
నీకోమల పదసారస భక్తిదానమునూ-నీ
కైవల్యపద సౌఖ్యము ప్రాకటముగనూ
సాకు నొసంగముకరుణా బొచ్చితిశరణూ - నాకీ
[illegible]సతా శరిసౌఖ్యకృతా సూచితతా దీనహితా వేదను తా|| శ్రీ ||

